







# సుదర్శన్ చిట్ ఫండ్

యూనిట్ ఆఫ్

## సుదర్శన్ ట్రేడింగ్ కంపెని లిమిటెడ్

రిజిస్టర్డ్ ఆఫీసు , కోజికోడ్-2
సెంట్రల్ ఆఫీసు: సుదర్శన్ బిల్డింగ్స్ వైట్స్ రోడ్, మద్రాసు-14

aries:STC:276TE



# ఫొటోగ్రఫీలో వినోదం కోసం ఆగ్ఫా క్లిక్ III

అభ్యాసానికి, అనుదిన వినియోగానికి అత్యుత్తమం

- ఉపయోగించుట తేలిక ఎడ్జెస్టిమెంట్లు అవసరం లేదు
- ప్రతి 120 రోల్‌తో, 12 పెద్ద సైజు (6 x 6 సెమీ) చిత్రాలు తీయవచ్చు.
- ఎవర్-రెడీ కేస్, పోర్ట్రెయిట్ లెన్సు, మరియు ఫ్లాష్ గన్ అదనపు వెలకు లభిస్తాయి.

ఇంకా ఎక్కువ ఉజ్వలమైన చిత్రాలు కావాలంటే, ప్రత్యేక యాక్రోమాట్ ఎఫ్. 8 8 లెన్సు అమర్చియున్న ఆగ్ఫా క్లిక్ IV చూడండి మసక వెలుతురులో కూడా. దీనితో మెరిసిపోయే చిత్రాలు తీయవచ్చు వెల 62.50 (పన్నులు అదనం)

కన్నులు మిరుమిట్లు గొలిపే ప్రింట్లు, ఎన్‌లార్జిమెంట్లు కావాలంటే, ఆగ్ఫా ఫొటో పేపరే వాడండి.

ఆథరైజ్డ్ ఆగ్ఫా డీలర్లు అందరివద్ద లభిస్తాయి

ఆగ్ఫా గెవార్ట్ సహకారంతో తయారు చేయువారు:
దీ న్యూ ఇండియా ఇండస్ట్రీస్ లి. బరోడా.




రు. 46.50 (పన్నులు అదనం)




సోల్ డిస్ట్రిబ్యూటర్లు:
ఆగ్ఫా-గెవార్ట్ ఇండియా లిమిటెడ్
బొంబాయి, క్రొత్త ఢిల్లీ, కలకత్తా, మద్రాసు






® ఫొటోగ్రఫిక్ ఉత్పత్తుల నిర్మాతలు, ఆగ్ఫా-గెవార్ట్ ఆంట్‌వెర్ప్-లివర్కు-సెన్ యొక్క రిజిస్టర్డ్ ట్రేడ్ మార్క్

ఆగ్ఫా క్లిక్—భారతదేశంలో విస్తార ప్రజాదరణ కల కెమేరా.

CMAG-139-202 Tel

# ఉత్తరాలు

## కథలు

"సంఘర్షణ" కథానిక వాస్తవికంగా, సహజ సంఘటనలతో చక్కగా వివరించారు. వెంకటరత్నం గారు.

డాక్టర్ రాజారావుగారి కూతురు వాసంతి ఏ కాలేజీలో చదువుతోందో తెల్పి, ఏం చదువుతోందో తెల్పటం అనవసరమనుకున్నారు కాబోలు రచయిత గారు!

ఎస్. ఆర్. తార [హైదరాబాదు 2]

* *

వై. రాంబాబు శాయి వ్రాసిన 'సంతృప్తి' కథ చాలా బాగుంది. పల్లెటూరి జీవితం గురించి తీయని కలలు కనే బస్తీవారికి చక్కని గుణపాఠం నేర్పుతుంది. పట్నంలో వుండేవారికి, పల్లె జీవితం దూరపు కొండలవలె గోచరిస్తుంది. కానీ, పల్లెలో నాలుగు రోజులు వుంటే, ఎంత దుర్భరమో స్వానుభవంలో తెలుసుకొనవచ్చు అనే సత్యాన్ని చక్కగా ఈ కథలో చిత్రించారు.

—కే. వి. రఘురామమూర్తి [గుంటూరు]

* * *

"సుమిత్ర" కథ నాకు బాగా నచ్చింది. చదివి నాకు ఉత్తరము వ్రాయాలనిపించింది. ఆ కథను రచించిన దుర్గాసింగ్ టాకూర్‌కు నా అభినందనలు. "ఎండా కాలను" కార్టూనులు చాలా బాగున్నాయి. అడవి కథ కూడా బాగుంది. "లవ్ లెటర్" బొమ్మల కథ సీరియల్ కూడా బాగుంది.

యన్. కె. ఖాజారసూల్ [ఆత్మకూరు]

* * *

"సుబ్బలక్ష్మి సఖుడి కథ' చాల బాగుంది. యిప్పుడు ఎండాకాలం కనుక, "ఎండాకాలం కార్టూన్లు" దానికి సరిపడేలాగ వున్నాయి. ముఖచిత్రం ఊర్వశి శారద శక్తివంతమయిన అయస్కాంతంలా ఆకర్షించే లాగ వుంది.

గుండుమల్ల వెంకటరామారావు [భువనేశ్వర్]

## సీరియల్

'అపరాజిత' బాగా నడుస్తోంది. ఇప్పటికి ముగ్గురు రచయిత్రులు కలసి రాసినంతవరకు బాగుంది. మాధవి, రాధ, మధు పాత్రలు చివరికేమవుతాయో. పాపం మాధవి జీవితం ఎటూ కాకుండా అయింది. మధు ఉత్తరాన్నిబట్టి చూస్తే యెప్పటికైనా మధు రాధనే స్వీకరిస్తాడనిపిస్తోంది. కాని మాధవిలో నున్న ప్రేమని మధు చివరికి గుర్తించి పశ్చాత్తాప పడతాడో? లేక రాధేనా చనిపోవాలి. చివరికేమవుతుందోనన్న ఆత్రుత కలుగుతోంది. మరి నాయని క్రిష్ణకుమారి కలం ఎలా సాగుతుందో చూడాలి. 'ఖబ్బాన్ సినిమాల' గూర్చిన వ్యాసం బాగుంది.

కుమారి వి. లక్ష్మి [శ్రీకాకుళం]

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు:
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం: 12-6-'70
శ్రీ సాధారణనామ సం|| జ్యేష్ఠ మా|| శుద్ధ [illegible]
సంపుటము: 63 సంచిక: 39

స్థాపితము:
1908

ముఖ్య సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 26.00 |
| 6 మాసముల చందా | 13.00 |
| 3 మాసముల చందా | 6.50 |

## విషయానుక్రమణిక

ముఖచిత్రం:
'అలీబాబా నలభై దొంగలు'లో జయలలిత


వింటున్నారు
పార్టీ విమర్శకులు
రాజకీయ
ఆరంభ మయింది.
రాజకీయ పరిష్కారం
మైనారిటీ ప్రభుత్వం ఎలా
శ్రీమతి బండార నాయక్ విజయం
ఉచిత సలహా
ఉచిత సలహా
OOMMEN

# ప్రజల ఖర్చుపై మంత్రుల విలాసయాత్రలు

భారతదేశం ఖర్చు మీద ప్రపంచమంతా తిరిగి వచ్చే సీజన్ ఆరంభమయింది. స్విట్జర్‌లాండ్, ఫిన్‌లాండ్, పోలండ్ దేశాల నుంచి రాష్ట్రపతిగారికి ఆహ్వానాలు వచ్చాయి. వారికి, వారి శ్రీమతి గార్కి ఈ అయిదేళ్ళ లోపులోనే అన్నిదేశాల నుంచి ఆహ్వానాలు రావొచ్చు. తక్కిన దేశాలని పర్యటించడానికి ఇంకా టైముంది

ఆసియా, ఆస్ట్రేలియా, యూరోప్, మరో రెండు అమెరికా దేశాల్ని దర్శించిన ప్రధానమంత్రి ఇప్పుడు ఆఫ్రికా దర్శించనున్నారు. ఈ పర్యటన మారిషస్ నుంచి ఆరంభమవుతుంది. ఆమె పర్యటన వల్ల మనదేశానికి ఒరగబోయే మేలును గురించి వార్తాపత్రికలు  :గటి కలలు కనేస్తున్నాయి.

తక్కిన మంత్రుల పర్యటనలు ఈ నెలలో జరగబోయే మంత్రివర్గం మార్పుల మీద ఆధారపడి వుంటాయి.

## మంత్రివర్గంలో మార్పులు

మంత్రివర్గంలో జరగబోయే మార్పులు గురించి పత్రికా విలేఖరులు వూహాగానాలు చేస్తున్నారు. కాశ్మీరీయుడైన ఒక విలేఖరి— ఫక్రుద్దీన్ అలీ అహ్మద్ భారతదేశ ఆర్థికమంత్రి అవుతారని గట్టిగా చెబుతున్నారు. అలీ అహ్మద్‌గారికి అనుభవం ఎక్కువ. ఆయన అస్సాం‌కి ఆర్థికమంత్రిగా ఒకప్పుడు పని చేశారు. [అస్సాం రాబడి అంతా కలిసి బొంబాయి కార్పొరేషన్‌కి వచ్చేంత రాబడి వుంటుంది!] ఇది ఒక యోగ్యత. ఆయన ఆరాష్ట్రాన్ని విడిచి పెట్టెయ్యగానే అక్కడి వారికి పాకిస్తానుపై అభిమానం చాలవరకు తగ్గిపోయింది—ఆయన సామర్థ్యానికి ఇదో సర్టిఫికెట్టు. ఇండస్ట్రియల్ డెవలప్‌మెంట్ శాఖకి మంత్రిగా వుంటూ ఆయనగారు చేస్తున్న సేవ అగణితమైంది! వీరి యజమాయిషీలో ఏ పరిశ్రమా అభివృద్ధి చెందలేదు. పారిశ్రామికీకరణాన్ని నిరోధించడానికి, వ్యతిరేకించడానికి శాయశక్తులా కష్టపడ్డారు!

## ఆర్థికమంత్రి ఫక్రుద్దీన్‌గారు !

ఇంకా చెప్పాలంటే విదేశీ సహకారంపై ఆయన కృషి ఒక ఉదాహరణ! విదేశీ మారకద్రవ్యాన్ని నిలవ చెయ్యడానికి ఆయన పడిన శ్రమ అంతా యింతా కాదు.

టెలిఫోన్ కేబుల్స్‌ని ప్రయివేట్ కంపెనీలు తయారు చెయ్యడానికి ఆయన అనుమతించలేదు. ప్రభుత్వం తరపునే తయారు చెయ్యాలని ఆయన వాదం. ప్రభుత్వం తయారు చెయ్యడానికి కొంత కాలం పడుతుంది. ఎంతకాలమైనా పట్టొచ్చు. ఈలోపులో టెలిఫోన్ కేబుల్స్ దిగుమతిపై ఎంతో డబ్బు వెచ్చించవలసి వచ్చింది! ఇదంతా విదేశీ మారక ద్రవ్యాన్ని కూడబెట్టడం కోసమే!

స్టాండర్డు మోటార్స్ మూసివేత మరో ఉదాహరణ. ఎందుకు మూసి వేస్తున్నారో మేనేజిమెంటు అందరికీ తెలియపరిచారు. కంట్రోలు చేసిన ధరని అలా వుంచి పనివారి ప్రవర్తన కంపెనీ మూతకి దారితీయించింది. ఆ ఫ్యాక్టరీని ప్రభుత్వం తీసుకోవాలని పరిశ్రమల మంత్రిగారి అభిప్రాయం. ఈ యోగ్యతల నన్నింటినీ దృష్టిలో వుంచుకుంటే ఆయన భారతదేశ ఆర్థికమంత్రి పదవికి అసలైన వ్యక్తి అని మనకి బాగా తెల్లమవుతుంది.

## ఇంద్ర గుజ్రాల్ మంత్రాంగం

ఇంద్ర గుజ్రాల్ కేంద్ర మంత్రిగా సూచిస్తున్నాయి పత్రికలు. అలాగే అయితే పత్రికా స్వాతంత్ర్యం పోయినట్టే. పెద్ద పెద్ద వార్తాపత్రికల నన్నింటినీ 'ట్రస్టు'లుగాను, 'కార్పొరేట్'లుగాను చెయ్యాలని ఆయన ప్రయత్నం. అడ్వర్‌టైజుమెంట్సు, న్యూస్‌ప్రింట్ కేటాయింపుల్లో జరుగుతున్న అన్యాయం ప్రజలకి తెలియందేమీ కాదు!

మరో వార్త ఏమిటంటే— చోటా రాజా దినేష్ సింగ్‌గారు కేంద్రం నుంచి వైదొలగుతారని. ఆయన స్థానంలో సర్దార్ స్వరన్‌సింగ్‌ని సూచిస్తున్నారు. ఈయన ఏ పనికయినా తగినవారే.

## ప్రచారంలేని గుల్జారీలాల్ నందా

లాలా గుల్జారీలాల్ నందాగారు రైల్వేమంత్రిగా వుంటున్నారు. కాని, ఆయనకి పత్రికల్లో అంత ప్రచారం లభించడం లేదు. అంచేత పదవి మార్చడానికి అవకాశం లేకపోలేదు. నందా మూడవ తరగతిలో పర్యటించి ఆ తరగతి ప్రయాణీకుల ఇబ్బందుల్ని గమనించారు. అయినా ఆయనకి ప్రచారం దొరకలేదు. రైల్వే ఆదాయం పెరిగిందట! కారణం లాలాగారే! రిజర్వేషన్ సిస్టమ్‌ని సుఖాయాసపరిచే విధానం ప్రవేశ పెడుతున్నట్టు ప్రజలకు తెలియపరిచారు. ఇది కూడా పత్రికల్లో ప్రముఖమైన చోటు చేసుకోలేక పోయింది. ఇక ఆయన ఫోటోల సంగతి సరేసరి. పత్రికా ఆయన ముఖాన్ని కనబడనివ్వడం లేదు. లాలాజీ గారికి— పత్రికలో ఎక్కువ ప్రచారం లభించే ఏ పదవినన్నా యివ్వమని లాలాజీగారి ఆత్మీయులు కోరుతున్నారు.

హనుమంతయ్యగారు ఈమధ్యనే ప్రధానమంత్రికి జ్ఞాపకం చేశారు. మంత్రి పదవి గనక యిస్తామంటే తాము నిరాకరించము: ఆయన ఒక ప్రకటన చేశారు. ఇంత దయ చూపిన హనుమంతయ్యగార్కి కృతజ్ఞతలు చెప్పుకోవాలి!

## శ్రీమతి గాంధీ తలనొప్పి

జగ్‌జీవన్‌రాం ప్రధానమంత్రికి ఒక పెద్ద తలనొప్పి! ప్రధానిని సమర్థించినందుకుగాను ప్రతిఫలమేమిటని ప్రధానిని నిగ్గ తీస్తున్నారిప్పుడాయన. కేంద్ర మంత్రివర్గంలో వున్నంతమాత్రాన లాభమేమిటి? అంటున్నారు. బహుశా ప్రధానమంత్రి అవుదామని వారి తలంపు అయివుండవచ్చు. బాబూజీ కోరికలు ప్రధానికి తెలియనివి కావు అతని ప్రతిభా ఆమెకి తెలుసు. నోటీసన్నా ఇవ్వకుండా మొరార్జీదేశాయ్ గారిని సాగనంపినందుకు ఆమె అతన్ని అభినందించార కూడా...

ప్రధానిని ఎదుర్కొనే సమస్యలు అనేకం వున్నాయి. మనసుకి ఏమితోస్తే అది చేసేస్తుందామె. వచ్చేనెలలో పర్యటనకి బయలుదేరే ముందే మంత్రివర్గంలో మార్పులు చేసేస్తారు.

## ప్రభుత్వోద్యోగులు—ఉద్యోగాలు

ఉద్యోగులకి మూడవ పే కమిషన్‌పై ప్రభుత్వం మొదట్లో సుముఖత కనపరచలేదు. కమ్యూనిస్టుల వత్తిడి వల్ల, దాన్ని అమలుపరచక తప్పలేదు. రోజులని బట్టి సంవత్సర సంవత్సరానికీ జీతాలు పెంచడమనేది భారతదేశంలో ఎంతవరకూ సమర్థ

నీయం? అవసరాలకు తగినంత జీతం అన్నప్పుడు అవసరానికి తగినన్ని ఉద్యోగాలు మాత్రమే వుండ వలసి వస్తాయి. ప్రభుత్వం ఈ విషయంలో ఎంత నిఖచ్చిగా వ్యవహరిస్తుందో ప్రభుత్వోద్యోగు లకు మాత్రం తెలియదా? వారికి ఆఫీసుల్లో ఎంతెంత పని వుంటుందో? ఆ పనిని వారు ఎంత సక్రమంగా నిర్వర్తిస్తున్నారో ఉద్యోగులకు మాత్రం తెలియదా!

## యదా రాజ తథా ప్రజా

ప్రభుత్వోద్యోగుల మాట అలా వుంచుదాం. మంత్రులు ఏం చేస్తున్నట్టు? వారు ఎంత సక్ర మంగా విధులను నిర్వర్తిస్తున్నారు? బడ్జెట్‌పై వారు తీసుకుంటున్న శ్రద్ధే ఇందుకు సాక్ష్యం!

రైల్వే ఫేర్‌ల పునరాలోచన, సైకిళ్ళ నుప యోగించేవారికి ఇన్‌కంటాక్సు రద్దు సౌకర్యం, ఏప్రిల్ ఆరవ తేదీన యస్. యస్. పి. వారిపై దౌర్జన్యం మీద జుడిషియల్ ఎంక్వయిరీ ల్లాంటి కొన్ని సౌకర్యాలవల్ల ప్రభుత్వం గండం గడిచి, గట్టెక్కింది అని చెప్పాలి. లేకపోతే వ్యతిరేకంగా ఎంత రభస అన్నా జరిగి వుండేది!

మరో అదృష్ట మేమిటంటే మతోన్మాదం గురించిన ప్రస్తావన వచ్చినప్పుడు లోక్‌సభలో కోరం లేదు! మరికొన్ని డిపార్ట్‌మెంట్ల గ్రాంట్ల విషయం కూడా వాయిదాలు పడ్డాయి.

సోషలిస్టిక్ ప్రోగ్రాంని ప్రవేశ పెట్టడంపై ప్రధానమంత్రి ఒక పెద్ద ఉపన్యాసం ఇచ్చారు:

## శ్రీమతి గాంధీ ఘనకార్యాలు

"14 పెద్ద బ్యాంకుల జాతీయీకరణం—వాటి ఋణ విధానం, వ్యాపార రంగంపై కొన్ని ఆంక్షలు, ప్రభుత్వరంగం విస్తరణ, ఫుడ్ కార్పొరేషన్‌కి విస్తృత సౌకర్యాలు, భూమి హక్కులకి సంబంధించిన చట్టము, ఇండస్ట్రియల్ లైసెన్సింగ్ పాలసీలో మార్పులు, లిమిటెడ్ కంపెనీల్లో మేనేజింగ్ డైరెక్టర్, ఫుల్ టైమ్ డైరెక్టర్ల, జీతనాతాల విషయంలో చేర్పులూ— ఇవన్నీ ముఖ్యమైన అంశా లుగా ఆమె పేర్కొన్నారు. ఈ సందర్భంగా కొన్ని డాక్యుమెంట్లు పరిశీలించవలసి వుంటుంది.

1. నాల్గవ పంచవర్ష ప్రణాళిక [1969—74]
2. సంవత్సర ప్రణాళిక [1969—70]
3. టువర్డ్సు గ్రోత్ ఆఫ్ సోషల్ జస్టిస్ [1970-71 బడ్జెట్ కాయితాలతో పాటు పంచిపెట్టారు]

దశసూత్ర ప్రణాళికని ప్రక్కకి నెట్టేసిన విషయాలివి. బెంగుళూరు సమావేశంలో ఇందులో ఎన్ని సోషలిస్టు పద్ధతుల్ని అమలు పరచినట్టు? మన ఆర్థిక విధానం ఎప్పుడూ పటిష్టంగా లేదు. సర్వాధిపత్యం కొన్నేళ్ళుగా అలాగే వుంటూ వస్తు న్నది. రెండేళ్ళ క్రితం, హజారీ రిపోర్టును పరిశీ లిస్తే కొత్త పారిశ్రామిక విధానం మంచి చెడ్డలు బోధపడతాయి. ●





గొలుసునవల

# అపరాజిత

నలుగురు రచయిత్రుల సంయుక్త రచన

నాలుగవ భాగం

నాయని కృష్ణకుమారి

## జరిగిన కథ

శ్యామల రాధలతో పాటు మాధవిని కూడా స్వంత కూతుర్లాగే పెంచింది పరమేశ్వరి. శివశాస్త్రికి మాధవి మీద కంటే మాధవి తెచ్చే జీతం మీద అభిమానం ఎక్కువ. శ్యామలకి రాజారావుతో పెళ్ళయింది. శ్యామల బిడ్డని కని కన్ను మూసింది. ఆ బిడ్డభారం మాధవిపై పడింది. ఆ యింట్లోనే అద్దెకుంటున్న మధు మాధవిని ప్రేమించాడు. మాధవిని రాజారావు పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాడని తెలుసుకుని మధు కంగి పోయాడు. రాధ తిరుగుళ్ళ గురించి మాధవి హెచ్చరించవలసి వస్తుంది. రాజారావు ఉత్తరానికి మాధవి హతాశురాలవుతుంది. పాపని అతనికి అప్పగించడానికి పరమేశ్వరి ప్రయాణమవుతుంది. మాధవి మధుని వెతుక్కుంటూ వెళ్తుంది. నిరాశతో తిరిగివస్తుంది. రాధకి మధుకి గల సంబంధాన్ని తెలుసుకుని మాధవి ఆశ్చర్యచకితురాలవుతుంది. రాధరాసిన ఉత్తరంలో ఆమె మనస్తత్వం పూర్తిగా అర్థమైపోయింది.

## 15

మాధవి గుండెల్లో ఎగదట్టిన మంట చెవుల్నీ, చెంపల్నీ వెచ్చని ఆవిరులతో కాలుస్తున్నట్లుగా ఉంది. రాధమీద ద్వేషమో, జాలో ప్రేమో, ఏదో తెలీని ఊహల వెల్లువలో మునిగి ఆవిడ రాతిబొమ్మలా ఉండిపోయింది. చేతులో ఉత్తరం రెపరెప కొట్టుకుంటూ అటూ ఇటూ తారట్లాడుతున్నది. తన మనస్సు ఆ ఉత్తరంలాగే చలించిపోతూ అందులో ఒకసారి రాధా, మరొకసారి మధూ దాగుడుమూత లాడుతూ కనపడుతున్నారు. రాధ తాననుకున్నంత అమాయకురాలు కాదు. ఎవరికీ తెలియకుండా గుప్తంగా విరిసిన ఆవిడ వ్యక్తిత్వమందు తానే బేలయై వెలాతెలపోతున్నట్లు స్పష్టమైపోయింది.

'ఎక్కణ్ణుంచే ఉత్తరం!' పరమేశ్వరి ప్రశ్నించింది. 'రాధ రాసింది పెద్దమ్మా!' అది క్షేమంగా మా స్నేహితురాలి దగ్గరికి చేరిందట. ఉద్యోగంలో చేరబోతున్నదట. నెలకు దాదాపు నూటయాభై రావచ్చు. మొత్తానికి ఆ అల్లరిపిల్ల జీవితంలో పెద్దతనం ప్రవేశించింది. లేకపోతే నవ్వుతూ తుళ్ళుతూ తిరిగేపిల్ల, పైచదువుల మాటైనా ఎత్తకుండా టపీమని ఉద్యోగంలో ఎందుకు కుదురుకుందంటావ్!' మాధవి జవాబును ఆశించి ప్రశ్న వెయ్యలేదు. ఏదో గలగల మంటూ నోటికొచ్చింది చదివేసింది. తన స్థితిని పెద్దమ్మ పట్టేయకుండా ఉండడానికి చేసిన సఫలప్రయత్నం అది.

'ఏమో తల్లీ! దాన్ని కని పెంచానన్న మాటేగాని దానితత్వం ఏమిటో ఇంత వరకూ నాకు అంతుపట్టలేదు. ఆ బియ్యే పరీక్ష అయినాక అది కుదురుగా ఇంటిపట్టున ఉన్నట్లే అనిపించలేదు. పొద్దున్నపోయిన పిల్ల చీకటిపడి ఇంటికొచ్చేది. అదేమంటే బ్రహ్మరాక్షసిలా విరుచుకుపడేది. ఏ క్షణానకానీ, తాను ఉద్యోగ ప్రయత్నం చేస్తున్నానని, ఎంత దూరమైనాసరే కన్నవాళ్ళను వదిలేసి వెళ్ళిపోగలననీ సూచించనైనా లేదు. ఏ బాధ్యతా లేకుండా బతికేస్తూ, ఏదన్నా మంచి చెప్పబోతే నీమీదా నామీదా విరుచుకు పడుతూ జల్సాగా కాలం వెళ్ళబుచ్చిన పిల్ల ఉన్నట్లుండి ఉద్యోగం చేస్తానంటూ అంతదూరం పోవటమేమిటో అందుకు నువ్వూ తాళం వేసినట్లే చేసి, మా స్నేహితురాలుంది, అన్నీ చూచుకుంటుందని దాన్ని పంపించడమేమిటో, ఇదంతా నాకిప్పటికీ అర్థం కాలేదు మాధవీ! అది లేకపోతే ఈ యింటికి కళే లేదు. పెద్దది మనల్నందరినీ మోసంచేసి దాని దార్న అది తిరిగి రాని లోకాలకు వెళ్ళనే వెళ్ళింది. ఇదయినా కళ్ళెదుట ఉండకుండా ఊళ్ళుపట్టుకు వెళ్ళిపోయింది. పెంచిన మమకారానికి నువ్వుమాత్రం మమ్మల్ని విడవలేకుండా ఉన్నావు. నీ జీవితం నట్టేట ముంచుతున్నా మామీద నీకు కోపం రావడం లేదు. తల్లీ! అది మాకు అదృష్టమే అయినా నీకుమాత్రం కాదు!—' పరమేశ్వరి గొంతు రుద్ధమైపోయింది. మాధవి కళ్ళల్లో తెరలాడిన నీటిపొరలు ఒక్క పరమేశ్వరిని పది బొమ్మలుగా చూపించసాగాయి. మాధవి చటుక్కున కళ్ళు ఒత్తుకుంది.

'ఛ! ఊరుకో పెద్దమ్మా! ఇప్పుడు నీకీ ఆవేదన అంతా ఎందుకో తెలియడం లేదు. అసలేం జరిగిందని నువ్విలా బాధపడుతున్నట్లు! రాధ ఉద్యోగంకోసం పొదు

గూరికి పోవడం తప్ప?' ఇక నేనంటావా! నా పెళ్ళిగురించేగా నీ మనస్సులో బాధంతా! విను పెద్దమ్మా! ఈ జన్మకిక నేను పెళ్ళి చేసుకోను అమ్మ ఎవరో ఎరగకపోయినా తల్లి ఆదరణ ఎటువంటిదో చూపించినదానివి నువ్వుతప్ప ఈ లోకంలో నాకెవరూ లేరు. ఎప్పటికీ నిన్ను వదిలి పెట్టి వెళ్ళేస్థితి ఈ జీవితంలో రానీయను' — మాధవి ఆవేశంలో చెప్పున్న మాటలు మంత్ర ముగ్ధలా వింటూ ఉండిపోయింది పరమేశ్వరి. రెండుక్షణాల నిశ్శబ్దం తర్వాత, కొంచెం సంకోచం ధ్వనించే గొంతుకతోనే,

'మధు ఆచూకీ ఏమీ తెలియనేలేదా మాధవీ?' అని ప్రశ్నించింది—

చేసిందంతా చేసి, మధును దూరంగా తరిమేసినట్లే చేసి వీళ్ళకిప్పుడీ ప్రశ్నలెందుకు! వీళ్ళ అనిశ్చిత స్థితివల్ల కదూ 'తన్ను మనఃపూర్వకంగా ప్రేమించిన మధు దేశాలు పట్టిపోయింది! ఇప్పుడా చపలచిత్తుడు తిరిగివచ్చి మాధవీ నువ్వు లేందే నేను బ్రతకలేను అని తనముందు మోకరించి అర్థించినా అతణ్ణి స్వీకరించే స్థితి తనకు ఎక్కడ మిగిలిందని! ఇక మధు తనవాడు కాడు! కాలేడు? ఈ ఊహవల్ల మాధవి శరీరం గరళపొడిచింది దుఃఖం కసి అసూయ ముప్పిరిగొని ఆవిణ్ణి వేగించ సాగాయి. కళ్ళనిండా కమ్ముకుంటున్న నీటిపొరను రెప్పలమాటు అణచివేయడానికి విశ్వప్రయత్నం చేసింది

'పెద్దమ్మా! దయచేసి యికనెప్పుడూ ఆయన ప్రసక్తి నా దగ్గర తేకండి అలాగే నా పెళ్ళి ప్రసక్తి కూడా! శ్యాములక్కయ్య పెళ్ళికని తీసుకున్న అప్పు వడ్డీసహా పైసలతో ఆయనకు తీర్చేశాను. ఇక మనకూ ఆయనకూ మధ్య ఎటువంటి ఋణానుబంధమూ లేదు. అటువంటి మనిషొకడు మనమధ్య మసిలేవాడన్న జ్ఞాపకాన్నికూడా తుడిచివేయండి నా కోసం, నా మనశ్శాంతికోసం ఈ నాలుగు గోడల మధ్యా వినబడకుండా ఉండేట్లు చేయండి. ఈ మాత్రం నాకోసం చేయలేరా పెద్దమ్మా! జీవితాన్నంతా మీ కోసం మీదు కట్టుకొన్న నా కోసం ఈ చిన్నపని చేయలేరా?—' ఈదరగాలికి చలించే చిగురాకులా ఉద్రేకంతో ఊగిపోతూ



# అపరాజిత

గట్టిగా అరుస్తున్న మాధవిని విస్తుబోయి చూడసాగింది పరమేశ్వరి. అవిరళంగా చెంపలమీదికి జారుతున్న కన్నీటి ధారకు కరిగిపోయి వస్తున్న మాధవితలను తన రెండుచేతుల మధ్యా పొదువుకుని గుండెకు హత్తుకుంది.

'నే చచ్చిపోయాను తల్లీ! చేతులారా పెంచిన నీ మనస్సులో ఆరని చిచ్చు రగులు కోడానికి నేనే కారణం. ఈ పాపానికి ప్రాయశ్చిత్తం లేదు. ఏదో నిరవాకం చెయ్యగలనని నిన్ను తెచ్చాను. చదువుకుని బుద్ధిమంతురాలివై పెంచిన దోషానికి, ఈ కుటుంబానికి పెద్ద అండగా నిల్చిన నువ్వు పెళ్ళిచేసుకుని పిల్లాపాపతో సుఖంగా ఉంటే చూద్దామన్నదే నా ఆశ. కాని మను షులూ దేవుడూ, నీ జీవితంలో సుఖో దయానికి రాహువుల్లా అడ్డపడుతుంటే తటస్థంగా చూస్తూ ఉండిపోయానే తప్ప నీకేమీ చెయ్యలేకపోయాను. అందరూ వంటింట్లో పడుండే ఛాందసురాలను కుంటుంటే, నేనూ అదే పదే పదే మన స్సులో అనుకుంటూ, నన్ను నేను నమ్మించు కుంటూ నిన్ను నిర్లక్ష్యం చేశాను. తెగించి నీ జీవితం చక్కదిద్దే ప్రయత్నం చెయ్య లేకపోయాను. ఈ పాపం నాదేనమ్మా!' అంటూ భోరుమంది పరమేశ్వరి. మాధవి వస్తున్న కళ్ళు తుడుచుకుని,

'ఛ! ఊరుకో పెద్దమ్మా! ఏమీ తెలియ దనుకున్న నీ మనస్సునుకూడా ఇంత కోత పెడుతున్నాననుకోలేదు. నువ్వు ఊరుకోక పోతే నామీద ఒట్టే—' అన్నది.

పరమేశ్వరి మరేమీ అనకుండా లోలో పల ఆలోచనల్ని తవ్వుకుంటూ అలాగే ఉండిపోయింది.

*      *

సత్యవతమ్మగారు మెత్తని గొంతుకతో లాలిస్తున్నట్లుగా రాధకేసి చూసి అంటు న్నారు. 'నీ అభిప్రాయాల్లో ఉన్న నిర్భయ త్వానికి నేను ముచ్చట పడుతున్నాను. కాని అన్నివేళలా మనిషికి భయరాహిత్యమొక్కటే శ్రీరామరక్ష కాలేదు. సమాజం నిర్భ యంగా ఉండే మనుషుల్ని గౌరవించగల దేమోగాని, సమయం దొరికినప్పుడు ఆ గుణాన్నే ఒక నంకగా తీసుకుని ఆ మని షిని అథఃపాతాళానికి తొక్కివేయాలనే పథకాలు వేస్తూ ఉంటుంది. నలుగురు నడిచే తోవలో నడిచినన్నాళ్ళూ నిన్నె వరూ గుర్తించనే గుర్తించరు. కాని నీకున్న ఆత్మధైర్యంవల్ల, నీ మనస్సుకు అబ్బిన విశాల దృక్పథంవల్ల, నీవు మంచి దనుకున్న వేపే కొంచెం మొగ్గి, అందరి కంటె భిన్నంగా నీవు కనిపించావా, అప్పుడు సమాజం నిన్ను పరిశీలించడం మొదలుపెడుతుంది. నిన్ను విమర్శిస్తుంది. అలనాటి భేతాళుడు విక్రమార్కుడిని పరీ క్షించినట్లు నిన్నూ రకరకాల పరీక్షల్లో పెడుతుంది. నీవలా అందరికంటె వేరుగా ఉండడం తప్పని నిరూపించడానికి నానా తంటాలూ పడుతుంది. చివరకు అర్థంలేని కసితో వేటకుక్కలా నిన్ను వెంటాడడాని కైనా వెనుదీయకుండా తయారవుతుంది. అందుకేనమ్మా ఇటువంటి సమాజంలో, ఆత్మధైర్యమొక్కటేకాదు, సమయస్ఫూర్తి, సందర్భోచితంగా ఇతరులు మనల్ని గమ నించని విధంగా మెసిలే మెలుకువా, అవ సరం.'

రాధ వింటోంది. ఆవిడ మాటలూ, నాటనిమించి ఆవిడ వ్యక్తిత్వమూ అపూ ర్వంగా కనిపించసాగాయి రాధకు.

ఆవిడ నిండుకుండలాంటి మనిషి. యాభైకి దరిదాపుల్లో ఉన్న వయస్సు. సగం నెరిసీ నెరవని వెంట్రుకలు, బియ్యమూ నువ్వులూ కలబోసినట్లుగా కనిపిస్తూ ఆవిడ ముఖానికి ఎంత అం దాన్ని పెద్దరికప్పు హోదాని కలిగిస్తు న్నాయి. ఒంటిమీద పెద్దగా నగలు లేవు. పచ్చగా ఉన్న శరీరానికి అతికినట్లుగా మెళ్ళో నానూ, చేతులకు రెండుగాజులూ అందంగా అమిరాయి. ఆవిడ ముఖం చూస్తే ఏ కోణంలోనూ చులకనభావం కలిగించే రేఖలే కానరావు. ఆవిడది అద్భుతమైన సౌందర్యం కాకపోయినా చేయెత్తి దణ్ణం పెట్టాలనిపించే సొగసు.

రాధ ఆలోచనలు వెనక్కు పరిగెత్తి నయ్ — ఈవిడ చెప్తున్న మాటలకూ మాధవి ఆలోచించిన పద్ధతికీ ఎంతైనా సామరస్యం ఉంది. తన విషయం తెలిస్తే అమ్మా నాన్నా బయటికి తరిమేస్తారని తను ఊళ్ళోనే వేరే ఉంటానన్నది. ఉద్యోగం చూచుకుని తనవాళ్ళతో తెగ తెంపులు చేసుకుని తన బతుకేదో తానే బతుకుతానన్నది. అప్పుడు మాధవి ఎంత చక్కగా చెప్పింది?

'నీ అభిప్రాయాలు నీవు రాసే నవ లల్లో అయితే బాగుంటయ్. కాని కార్యా చరణంలో కొంత సమయస్ఫూర్తి అవ సరం. ఈ ఊళ్ళో ఉండి నీవు నిశ్చింతగా బతకలేవు. ఎంత నీవు నమ్మిన ఆదర్శ మైనా, దానికి సంఘం ఆమోదముద్ర ఉంటేనే నిశ్చింత. అది లేనినాడు సంఘంతో ఘర్షణ పడకుండా తప్పించు కుంటూ సమయస్ఫూర్తితో నీవు నమ్మిన ఆదర్శాలను అనుసరించడం ఉత్తమం'— అన్నది. అంతేకాకుండా అందుకు పరి



స్వారంగా తన ఊరికి దూరంగా ఈ హైదరాబాదు నగరానికి ఉద్యోగ మిష మీద పంపించింది — తన స్నేహితురాలి అక్క దగ్గరికి పంపిస్తానంటే ఆవిడ తనకేం ఒరిగించగలదని అనుకున్నది గాని, ఆ స్నేహితురాలి అక్కరూపంలో ఇంత విజ్ఞాన ఖనిని, ఇంత సౌమ్యరాశిని చూడ గలనని అనుకోలేదు —

'ఏవిటో ఆలోచిస్తున్నావ్ రాధా !'

'ఏం లేదండీ ! మీ మాటల్నే నెమరు వేసుకుంటున్నాను.'

'నా మాటలు కేవలం పెదాలమీద నుండి వచ్చినవికావు తల్లీ ! దాదాపు పది సంవత్సరాల అనుభవాన్ని రంగరించుకుని వెలువడ్డ కఠినసత్యాలు. నేను నడుపుతున్న రెస్క్యూ హోమ్‌ని ఇంకా నువ్వు చూడలేదు. దైవోపహతులైన ఎందరు అభాగ్య జీవులకి శరణాలయం బ్రతుకు మీద మమకారాన్ని పెంచిందో ఎరుగుదువా రాధా ? ఒక్కొక్కసారి సంఘంచేత నిర్దాక్షిణ్యంగా బహిష్కరింపబడిన స్త్రీల హృదయ విదారక గాథలు వింటుంటే భగవంతుడిమీద చెప్పరాని అసహ్యం కలిగేది. న్యాయా న్యాయాలను సమదృష్టితో విచారించే కరుణామయుడు ఒక తప్పుకు స్త్రీకొక న్యాయాన్ని పురుషుడికి మరో న్యాయాన్నీ ఎందుకు కలిగించినట్లు ! సర్వ సాక్ష్యాలతోటే స్త్రీనే అపరాధిని చేసి పురుషుణ్ణి ఏ న్యాయస్థానానికీ అందనీయకుండా ఎందుకు తప్పిస్తున్నట్లు ! ఇందులో స్త్రీ ప్రత్యేకంగా చేస్తున్న అపరాధమేమిటి ? తెలిసో తెలియకో క్షణికమైన ఇంద్రియోద్రేకాలకు లొంగిన నేరానికి, తాము పెరిగిన సంఘంలో ఉండే అర్హతనే ఆవిడ పోగొట్టుకోవడమేమిటి ? వివాహమైన స్త్రీ మాత కాబోతుంటే ఎంత కోలాహలం ! ఎంత ఉత్సాహం ! అదే మాతృత్వాన్ని అవివాహిత వహిస్తే ఎంత ఈసడింపు, ఎంత జుగుప్స! ఎక్కడుందీ భేదం! ఈ అనాథ స్త్రీలు నిర్భయంగా తల ఎత్తుకుని సంఘంలో తాము కన్న బిడ్డలతో గౌరవంగా బ్రతికేయోగం ఎలావస్తుంది! — ఆ రోజుల్లో నా మనస్సంతా ఇటువంటి ఆలోచనలతోటే సతమతమైపోయేది. దారీ తెన్నూ తోచేదికాదు. ఒక

# అపరాజిత

అప్రపోనిని, ఈ నిర్భాగ్యులకు నేనేం చెయ్యగలను, అని ఆక్రోశించే దానిని. నాకు కావలసినంత ఆస్తి ఉంది. ప్రాణానికి ప్రాణంపెట్టే భర్త, ముగ్గురు పిల్లలూ ఉన్నారు. సుఖమయమైన సంసారాన్ని కలిగిఉండీ, నా మనస్సు ప్రశాంతంగా ఉండలేకపోయింది. అందుకు నా కళ్లయెదుట జరిగిన ఒక హృదయ విదారక సంఘటన మరీ తోడయింది రాధా! మేమున్న యింటికి నాలుగిళ్ల అవతల ఓ మధ్యతరగతి కుటుంబం ఉండేది. ఇంటి యజమాని కలెక్టరాఫీసులో క్లర్కు. యజమానురాలు పిచ్చి ఇల్లాలు. నలుగురు ఆడపిల్లలకు తల్లి. పెద్దపిల్ల పదహారేళ్లది. సృష్టిలో ఉన్న సొగసంతా రంగరించి పోత పోసినట్లుగా ఉండేది. ఎప్పుడూ నవ్వుతూ చలాకీగా తిరిగే ఆపిల్ల మా వీధికే చల్లని వెలుగు. వీధిలో ఉన్నవాళ్లందరినీ పిన్నీ, అత్తా, వదినా అంటూ వరసలు కల్పించుకుని కలుపుగోలుగా తిరిగేది. చిన్నపనికీ పెద్దపనికీ అవసరం వచ్చినప్పుడు అరమరికలు లేకుండా సాయం వచ్చి ఆదుకుంటుండేది. నవ్వుల బండిలా తిరిగే ఆ పిల్ల జీవితంలోకి ఒక మగవాడు ప్రవేశించాడు. ఫలితం చెప్పనక్కరలేదు. తల్లీ తండ్రీ నెయ్యిపోసిన అగ్నిలా మండిపోయారు. మా వంశానికి అప్రతిష్ఠ తెస్తున్నావే, అంటూ తండ్రి తన కన్నకూతుర్ని తాను పెంచిన చేతుల్తోనే చావబాదాడు. తల్లి అనరాని మాటలన్నీ అన్నది. నీవు ఏ నూతిలోనన్నా పడిచస్తే ఈ అప్రతిష్ఠ ఉండదంటూ వాపోయింది. జీవితమంతా పువ్వుల నావలా సాగించిన ఆ పిల్లకు రానున్న క్లిష్టపరిస్థితి అవగతమయింది కాబోలు! ఫలితాన్ని గూర్చి ఊహించకుండా అవితర్కితంగా ప్రవర్తించినందుకు చావే తగిన శిక్ష అనుకుని నూతిలో దూకింది. అంత సౌందర్యరాశినీ గుప్పెడు మట్టికింద మార్చిన వారంరోజులకు కథానాయకుడు రంగంమీద కవతరించాడు. ఆ పిల్లవాడు వాళ్ల యెదురింటి మేడమీద అద్దెకున్నవాడు. కాలేజీలో చదువుకుంటుండేవాడు. పరీక్షలై సెలవలకింటికి వెళ్లినవాడు. నిన్ను చూచుకోడానికి మా అమ్మా నాన్నా వచ్చారన్న శుభవార్త ఆ పిల్ల చెవిన వేయడానికి వచ్చాడట. ఇంతలో ఈ ఘోరం జరిగిపోయింది. వాకిట్లో గుడ్లప్పగించి నిలుచుండిపోయిన ఆ పిల్లవాడి తల్లిదండ్రులు వాడి నిజాయితీకి సాక్ష్యంగా కనిపించారు. ఆ పిల్లచేసిన చిన్న తప్పుకు నిండు నూరేళ్ల జీవితమూ పరిహారంగా చెల్లించబడ్డదా! తల్లిదండ్రీ కొంచెం ఓపిక పట్టి, రవ్వంత సానుభూతితో ఎందుకు ప్రవర్తించలేకపోయారు! అమానుషంగా చేతలతోటీ మాటలతోటీ హింసించి పువ్వులాంటి ఆ పిల్ల జీవితాన్ని విరిసీ విరియని దశలో, నేలనేసి కాలరాచారెందుకని! ఇంత ఘోరమైన సాంఘిక దురన్యాయం ఎంతమంది సంఘసేవకులు పట్టుపట్టి ఎన్ని రకాలుగా శ్రమిస్తే నశిసిపోతుంది! ఈ సంఘటన నా మనస్సులో పెద్ద కల్లోలాన్నే సృజించింది. భర్తనూ, ఇంటినీ, పిల్లల్నీ దాదాపు మర్చిపోయినట్లే చేసి ఎప్పుడూ ఈ విషయమే తలుచుకుంటూ వాపోయేదాన్ని. నా భర్త నా స్థితికి భయపడిపోయారు — 'ఇలా మనస్సులో మధనపడుతూ సాధించేదేదీ ఉండదు సత్యం! నువ్వేదన్నా చెయ్యదలచుకుంటే, ఆలోచనలోనే ఆగిపోక ఆ పని కావడానికి మార్గాలు వెదకాలి. నేనొకమాట చెప్తాను శ్రద్ధగా విను! నీ పుట్టింటినుండి నువ్వు బోలెడు ఆస్తితో వచ్చావిక్కడికి. నేనూ ధనవంతుణ్ణే. నాకున్నది మనం సుఖంగా ఈ లోకంలో బ్రతకడానికి సరిపోతుంది. నీ ఆస్తితో, నీ మనస్సును పీల్చి పిప్పిచేస్తున్న ఈ సాంఘిక దురన్యాయాన్ని ఎదుర్కోగలవేమో చూడు! అంగబలంతోపాటు అర్థబలాన్ని కూడా పొంది ఉండకపోతే ఆధునిక ప్రపంచంలో పనులు జరగవు' అన్నారాయన. కొంతసేపు నేనేం వింటున్నానో కూడా గ్రహించలేని స్థితిలో ఉండిపోయాను. ఆయనమీద కృతజ్ఞతో గౌరవమో ప్రేమో తెలియని స్థితి నన్నావరించుకుంది. లోకంలో సాధారణంగా స్త్రీ పడే కష్టాలకన్నిటికీ ఒక కారణంగా పురుషుడు ఎత్తి చూపబడుతూనే ఉన్నాడు. మళ్లీ 'ఆ పురుషుడే సంఘంచేత చావు దెబ్బలు తింటున్న స్త్రీ యొక్క అసహాయస్థితికి జాలిపడి సానుభూతితో చేయూత నివ్వడానికి నడుము కడుతూనే ఉన్నాడు. వీరేశలింగంపంతులు, రాజా రామమోహనరాయ్ లాంటి వాళ్లంతా ఎవరు? ఆ క్షణాన నా భర్తను కూడా వాళ్ల కోవలోకి చేర్చుకుని ఆత్మతృప్తితో తనివిపోయాను. ఆయన సలహావల్ల యేర్పడిన, అభాగినుల పాలిటి చల్లని నీడ రాధా ఈ రెస్క్యూ హోం.' సత్యవతమ్మగారు ఒక్క క్షణం మాట్లాడకుండా ఉండిపోయారు. నిశ్శబ్దాన్ని భంగం చెయ్యాలన్న తొందరతో రాధే మొదలుపెట్టింది మాట్లాడడం.

'అయితే దీనికి ప్రభుత్వ సహాయం లేదాండీ?'

'లేకేం! ప్రభుత్వ సహాయమే లేకపోతే ఇంతగా రాణించేదా! నేను విత్తనం వేసి నీళ్లు చల్లాను. భూమి సారవంతంగా ఉండేట్లు చేశాను. గొడ్డూ గోదా బాంతుపడి తొక్కి పాడుచెయ్యకుండా ఉండేటట్లు సంరక్షణ చేశాను. గింజ మొలకెత్తి సాగింది. దట్టమైన పందిరిలా ప్రభుత్వమే నిలవకపోతే, అది గాలిలో అల్లాడకుండా చెయ్యడం నాకు కష్టసాధ్యమే అయ్యేది'— ఆమె గొంతులో మాతృప్రేమ మనసు తొణికిసలాడుతోంది. రాధ చిన్నగా నవ్వుతూ,

'మీ ధోరణి చూస్తే మీ బిడ్డలమీదకంటే, ఈ రెస్క్యూహోమ్ మీదే మీకు మమకారం ఎక్కువలాగా కనిపిస్తోందండీ!' అన్నది.

సిగ్గనల్ల కాబోలు — సత్యవతమ్మగారి చెవులదగ్గర, ఎర్రదనం పలచ పలచగా వ్యాపిస్తూ, చెక్కిళ్లను నింపింది.

'నిజం! దీనిమీద నాకు అంతులేని మమకారమే' ఉంది. ఇది నా కలలకన్నిటికీ ఆకారం తెచ్చిపెట్టిన అద్భుతవనం. ఇది కేవలం సంఘందృష్టిలో పతితులైన అనాధస్త్రీలకు ఆశ్రయమివ్వడానికే నిర్మింపబడ్డది. ఏయే స్త్రీల విషయంలో 'మోరల్ లాప్స్' కనిపించిన వాళ్లు సంఘంచేత నిరసింపబడ్డారో వాళ్లందరికీ ఇక్కడ చోటున్నది రాధా! ఇందులో అవివాహితలై మాతృత్వం వహించబోయేవారున్నారు. భర్తలు వెళ్లగొట్టగా

'ఎక్కడా తలదాచుకోనుచోటు దొరకక ఇక్కడ గోప్యంగా గౌరవంగా బ్రతుకుతున్న వాళ్ళున్నారు. తెలిసో తెలియకో ఉన్నయిల్లు విడిచి, మనసు కోరిన వాడివెంట లేచి వచ్చి, వాడు మోసం చెయ్యగా దిక్కుమీగా విలవిలపోయిన పడుచులూ ఉన్నారు. అందరి సమస్యా ఒక్కటే. గత జీవితాన్ని పీడకలలా మర్చిపోయి, తిరిగి సంఘంలో గౌరవ భాజనమైన జీవితాన్ని ప్రారంభించడమే ఆ మహాకార్య సాధనలో మా ఆశ్రమం సర్వవిధాలా పాటుపడుతుంది. మన అండన చేరినవాళ్ళ కన్నీళ్ళు తుడిచి బ్రతుకులు సరిదిద్ది, వాళ్ళు కల కల విరిసే కల్హార పుష్పాలు లాగా చూసి మురిసిపోవడమే మా ధ్యేయం రాధా!'—

'ఇలా మీ అండన చేరినవాళ్ళకు ఎన్నాళ్ళు ఆశ్రయమివ్వగలుగుతారు మీరు.'

'దాదాపు ఎన్నాళ్ళపాటు! అసలు మా పథకాన్ని వివరంగా చెప్తాను విను! అవివాహితలై గర్భాన్ని ధరించిన వాళ్ళకు ఎవరింటివాడికీ తెలియకుండా ఆశ్రయమిచ్చి పురుడుపోసే బాధ్యత మాది. అందుకు తగిన హాస్పిటల్ సౌకర్యాలూ నిపుణుల సహాయమూ ఉన్నది. పుట్టినపాపను తల్లి అక్కరలేదనుకుంటే అనాథ శిశు శరణాలయాలకి పంపేస్తాము. పరిస్థితులు చక్కబడి తల్లి తన బిడ్డను తీసుకుపోవాలనుకుంటే ఆ బిడ్డ ఆమెకు అందుబాటులో ఉండేట్లు చూసే బాధ్యతకూడా మాదే. తల్లి తనవాళ్ళను కలుసుకోవాలనుకుంటే వెళ్ళిపోవచ్చు. లేక ఇక్కడే ఉండిపోదల్చుకుంటే ఉండవచ్చు. కాని అట్లా ఉండే కాలపరిమితి మూడు సంవత్సరాలు మాత్రమే. ఈ వ్యవధిలో ఆవిడ మేము నడిపే సంక్షిప్త శిక్షణాలయంలో చేరి మెట్రిక్ పరీక్ష ఇచ్చి ఉద్యోగమేదన్నా సంపాదించుకోవచ్చు. లేకపోతే! ఇక్కడే మేము నడుపుతున్న వివిధ శిక్షణ కేంద్రాలలో శిక్షణపొంది తన పొట్ట తాను పోసుకోవచ్చు. ఈ అర్హత పొందే వరకూ ప్రతిమనిషికీ నెలకు 40 రూపాయలు ఉచిత వేతనం ఇచ్చే ఏర్పాటు చేశాము— భోజనం, బట్టలూ, అన్నీ అందులోనే జరుపుకోవాలి. ఈ మొత్తం ఇంక కొంచెం ఎక్కువ చెయ్యడానికి ఎలా వీలవుతుందా అని, తల బద్దలు కొట్టుకుంటూ ఉంటాను. కాని, రాధా! అది వీలుకావడం లేదు' — ఆవిడ గొంతుకలో నిస్పృహ ధ్వనించింది—

'మీ మాటలు వింటుంటే ఒళ్ళు పులకిస్తున్నదండీ! మీరు ఎంత ఈ అభాగినులకు చేయూతనిస్తున్నారన్న దానికంటే, ఎంత గాఢంగా వారి సుఖమయ జీవితాన్ని వాంఛిస్తున్నారన్నదే ముఖ్యం. ఈ సమాజంలో ఉన్న మనుషుల్లో సగం మందికయినా మీకున్న సానుభూతి ఉంటే, వీళ్ళిలా అభాగినులుగా చరిత్రలో ఎందుకు మిగిలిపోతారు చెప్పండి! వాళ్ళ అభిశప్త జీవనంమీద మంత్రజలాన్ని చల్లే కరుణామయులు మీరు'—

'అంతపెద్ద మాటలెందుకులే! — అయినా యిటువంటి ఆశ్రమాలు ఒకటీ అరా చాలవు రాధా! కాలుజారిన ఏ స్త్రీ కూడా నిరాశ్రయంగా వీధుల్లోకి విసిరివేయబడనినాడు నా ఆశయం సంపూర్ణంగా నెరవేరినట్లు. చివరన్నట్లు ముఖ్యంగా ఈ రకమైన కృషి సఫలం కావటానికి మనస్సులలో పరివర్తన కలగడమే ముఖ్యం. సాంఘిక న్యాయమనేది పొరపాటు చేసిన వ్యక్తికి సానుభూతితో రక్షణ నిచ్చేదిగా ఉండాలే కాని, ఆ వ్యక్తిని సంఘంనుండి బహిష్కరించి శపించేదిగా ఉండకూడదు. ఈ సూత్రానికి స్త్రీ అయినా పురుషుడైనా సమానంగా అన్వయించబడ్డనాడే మనుషులు మనుషులుగా బ్రతకగలరు. మన సమాజ వ్యవస్థకు అటువంటి బంగారు కాలం ఎంత దూరంలో ఉందో కనీసం ఊహకైనా అందడం లేదు.'

(ఇంకా వుంది)

# పార్లమెంటుల అత్తగారు...

లండన్‌కి వెళ్ళేవారెవరూ హైడ్ పార్క్‌ని చూడకుండా రారు. ఇక్కడ 'స్పీకర్స్ కార్నర్' అనేది ఉంది — (ఉపన్యాసకుల స్థలం అని అనువాదం చెయ్యవచ్చునా?) అక్కడ ఎవరయినా ఏ సంగతిని గురించి అయినా మాట్లాడవచ్చు. ఇక్కడ ఉండే వాక్ స్వాతంత్ర్యం ఇంతా అంతా కాదు...

హైడ్‌పార్క్ నిన్నా మొన్నటిది కాదు. అది ఒకప్పుడు వెస్ట్‌మినిస్టర్ విచ్చేది. మొదటి ఛార్లెస్ కింద రేస్‌కోర్సుగా ఉండేది. 18వ శతాబ్దంలో ఇక్కడ ఉరి శిక్షలు వేస్తూ ఉండేవారు. అక్కడ బందిపోటు దొంగలు కూడా తమ వృత్తి సాగిస్తూ ఉండేవారు! షికారుకి వచ్చిన వారెందరో తమ ధనం కోల్పోతూ ఉండేవారు...

బ్రిటన్‌లో పోలీసుబలం ఎక్కువ అయిన తర్వాతనే హైడ్ పార్క్ ప్రాముఖ్యం పెరిగింది. నేడు అక్కడ ఎటువంటి విషయం గురించి అయినా మాట్లాడి వెళ్ళిపోతూ ఉండవచ్చు! అంతే కాదు, ఈ పార్క్‌లో మనం గమనించే మరొక విశేషం ఏమిటంటే — ఎండగా ఉన్నా, వాన కురుస్తున్నా, మంచు పడుతున్నాసరే, ఉపన్యాసకులకి కొరత ఉండదు. శ్రోతలకి కూడా కొరత ఉండదు...

అందుచేతనేనేమో వాగ్వివాదాలు పెరిగి కొన్ని సమయాలలో శ్రోతలకీ ఉపన్యాసకులకీ మధ్య భేదం తగ్గిపోతూ ఉంటుంది! కొన్ని సంవత్సరాలకి పూర్వం ఒక భారతీయ పత్రికా విలేఖరి ఉపన్యాసకుడితో భారత — పాకిస్తాన్ సంబంధ బాంధవ్యాలని గురించి వాదించటం విని తక్కిన శ్రోతలు అతన్ని 'వేదిక' (ఒక కొయ్య పెట్టె) మీదకి ఎక్కి మాట్లాడమన్నారుట!

నేను కొన్ని నెలల క్రితం, మంచి శీతాకాలంలో, ఇక్కడికి వెళ్ళాను. ఎనిమిది మంది మాట్లాడుతున్నారు. వినేవారు 500మంది దాకా ఉన్నారు. వారిలో వనితలు ఉన్నారు కాని వక్తలలో మాత్రం లేరు...

ఒక పాశ్చాత్య యువకుడు యోగాసనాలని గురించి దంచేస్తున్నాడు; వినేవారు 10మంది ఉన్నారేమో. వారిలో ఒక భారతీయుడు. అతను యోగాసనాలు నేర్చే మనిషి గావును ఉపన్యాసకుడి శ్రోతల సంఖ్య అంత తక్కువగా ఉండటం చూసి దిగాలుపడిపోయి ఉన్నాడు...

సాధారణంగా భారతీయులు మాట్లాడితే ఎక్కువమంది వచ్చి వింటారుట. నేను ఒకతను బ్రిటన్‌లోకి వలస వచ్చే భారతీయులని ఆపే ప్రయత్నాల్ని ఖండిస్తూ చేసే ఓ ఉపన్యాసాన్ని విన్నాను. ఇది ఎందరో భారతీయులకి నచ్చే వస్తువు కాబట్టి కరతాళధ్వనులకి కొరత లేదు.

'ప్రతి ఇంట్లోనూ ఒక విదూషకుడు ఉంటాడు! అలాగే ప్రతిదేశంలోనూను! మన విదూషకుడు ఎవరు?' అని అడిగాడు ఉపన్యాసకుడు. నేను కాదుకదా, అన్నట్లు ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు శ్రోతలు. ఒకతనుమాత్రం—"విల్సన్!" అని అరిచాడు. ఆ జోక్ విని అక్కడి బ్రిటిషువారు కూడా నవ్వారు.

నేను ఒక మధ్యవయస్కుడిని అడిగాను—ఉపన్యాసం ఎలాగా ఉంది, అని.

'ఇంగ్లీషు బాగుంది. అర్థం అంటారా, అర్థం, అన్వయం ఎవరికి కావాలి! మొత్తంమీద అతను చెప్పినదంతా నిజమే...' అన్నాడు అతను.

మరొకతను నాతో అన్నాడు. 'హైడ్ పార్క్ లేకపోతే లండన్ ఏమిటి?' అని.

నిజమే. బ్రిటిషు పార్లమెంటు తక్కిన వాటికి తల్లివంటిదయితే సణుగుడే ఎక్కువగా వినిపించే హైడ్ పార్క్ పార్లమెంటుల అత్తగారు వంటిది!

—కె. వి. యస్. రామశర్మ

ఫోటో: రచయిత



యోగాసనాలని గురించి మాట్లాడుతున్న ఒక బ్రిటిష్ వ్యక్తి. ప్రక్కనేఉన్న భారతీయుడు పలచగా ఉన్న అక్కడి శ్రోతలనిచూసి నిరుత్సాహాన్ని ప్రదర్శిస్తున్నాడు.


లవ్ లెటర్
బొమ్మలకథ సీరియల్-5


అయితే రేపొద్దున్న తొమ్మిదింటికి పందొమ్మిదో నెంబరు బస్టాప్ లో నా సుజాత ఒంటరిగా దొరకచ్చుగా!


ఆ మర్నాడు బస్టాప్ దగ్గర.
నా అంత అదృష్టవంతుడుండడురా! నేననుకున్నట్టు సుజాత ఒంటరిగానే వుంది చూడు


చూడండి! నాపేరు రాంబాబు! మీపేరు సుజాత అని నాకు తెల్సు! దయచేసి ఒక్క ప్రశ్నకి సూటిగా జవాబియ్యరూ!


మీరడగబోయే ప్రశ్న నాకు తెలుసు!


అయితే నాప్రేమని అంగీకరించావా సుజాతా!


ఇంకచాలు ఊరుకోండి! ఇది బస్టాప్ అన్నవిషయం మర్చిపోతున్నారు మీరు!


సుజా! నిన్న సాయంత్రం సూపర్ బజార్ లో నీతో మాటాడాలని ఎంత ప్రయత్నించానో తెల్సా!


అదిసరే కానీ, ఇప్పుడు నువ్వు ఆ కాలేజీకూడా కెళ్ళకపోతేనేం! ఇంచక్కా మనిద్దరం కల్సి అలా...


అమ్మయ్యో! ఇంకేమన్నా ఉందా! నే వెళ్ళకపోతే వాళ్ళంతా నన్ను చంపేయ్యరూ! అదుగో 19 నెంబరు బస్సు కూడా వచ్చేస్తోంది! టాటా!


ఆ! సుజాతా! అప్పుడే వెళ్తామన్నావా! ఇదిగో...
వెధవా! ఏమిటా పిచ్చికలు! ఇంక నిద్రలే!


ఛభ! ఇదంతా కలా!

**పాత్రలు:**

1. శేఖర్‌బాబు: హుందాగల వ్యక్తి. హైసొసైటీలోకి ప్రాకాలనే తాపత్రయంగల వ్యక్తి. వయస్సు 30 సం.లు.

2. రవి: ప్రమోదరావు ఆఫీసులో గుమాస్తా, రచయిత కూడాను, వయస్సు 30 సం.లు.

3. ప్రమోదరావు: లంచాలు మింగే ఆఫీసరు, వయస్సు 50 సం.లు.

4. భజగోవిందం: 'కాకా' పట్టే [ప్రమోదరావు ఆఫీసులోని] గుమాస్తా, వయస్సు 45 సం.లు.

5. శోభనాద్రి: ప్రమోదరావు స్నేహితుడు, లారీల ఓనరు. అప్పుడప్పుడూ ఎన్నికలలో నిలబడే రాజకీయ నాయకుడు. వయస్సు 45 సం.లు.

6. గోపీనాథ్: ప్రమోదరావు కొడుకు. సినిమా తియ్యాలనే పిచ్చి. వయస్సు 25 సంవత్సరాలు.

(తెర లేవగానే)

[ప్రమోదరావు ఇల్లు. అధునాతనంగా అలంకరింపబడిన హాలు. ఎడమచేతివైపున వీధిలోకి ద్వారం. హాలు వెనుకవైపు మధ్యనుంచి మేడ మీదకు రెండువైపులనుంచీ మెట్లు. కుడివైపుకి వెళ్ళే మెట్లక్రింద టెలిఫోన్. కుడిప్రక్కముందు వైపు యింటిలోపలికి దారి. సోఫా ఆడియన్సుకు ఫేస్ చేసి వుంటుంది. దాని యెదురుగా ఒక చిన్నసైజు టేబిలు. టేబిలుకు అటూయిటూ రెండు చిన్నసోఫా సైజు కుర్చీలు. ఎడమవైపుకు వెళ్ళే మెట్ల క్రిందనున్న టేబిలుమీద పెద్దసైజు బుద్ధుడు బొమ్మ. గోడలకు నెహ్రూ, గాంధీ ఫోటోలుంటయ్. తెరతీయగానే ప్రమోదరావు మెట్లమీదనుంచి పేపరు చదువుతూ క్రిందికి దిగివస్తాడు. టెలిఫోను దగ్గర పేపరువడేసి ఒక నంబరు డయల్చేస్తాడు.]

ప్రమో : ఎవరూ? శోభనాద్రేనా?... ఆఁ నేను...ప్రమోదరావుని మాట్లాడేది. ఆఁ...విశేషాల్చెప్పేందుకే పిలిచింది మరి... అన్నట్టు నీ పక్క నెవరన్నా వున్నారా? లేరూ ... సరిగాచూడు ... నీతో వెధవ గొడవ...నేనన్న మాటలన్నీ నాకే ఫోన్లో అప్పచెపుతూ వుంటావ్...నీ మొహంగానీ... ఆఁ... నేనిప్పుడు చెప్పబోయేదంతా నోరు మూసుకుని విను...యింతకీ విశేషం ఏవిటంటే యివ్వాళ మనం ఒక బ్రహ్మాండమైన వ్యక్తిని కలుసుకోబోతున్నాం... ఆయనో లక్షాధికారి. రెండురోజుల క్రితం క్లబ్బులో పరిచయం చేసుకున్నాను. సగంలో ఆపేసిన మన వ్యాపారాన్ని ఒక దారికి తేగల్గినాయనేనని నాకు నమ్మకం కలిగింది...ష్...నోరు మూసుకుని విను... ఇంకాస్సేపట్లో ఆయన మాయింటికొస్తున్నారు. నువ్వుకూడా యిక్కడికొచ్చెయ్. వెంటనేరా...ష్...ఏం మాట్లాడకు...వివరాలన్నీ యిక్కడ మాట్లాడుకుందాం [యింతలో భజగోవిందం వస్తాడు. ఫోన్లో మాట్లాడుతూ ప్రమోదరావు తనవైపుకు చూడంగనే దండం పెడుతూ వుంటాడు. ఇలా రెండు మూడుతడవలు జరుగుతుంది.]

సరే...వెంటనేరా [అంటూ ప్రమోదరావు ఫోన్‌క్రింద పెట్టంగానే భజగోవిందం మళ్ళీ దండం పెడ్తాడు. ప్రమోదరావు ఈ దండంకూడా చూడకుండా స్టేజి మధ్యలోకొచ్చి సోఫాలో కూర్చుంటాడు. కూర్చుని రిలాక్సింగు మూడ్‌లోకివచ్చి తనచుట్టూ పేపర్‌కోసం వెదికి, పేపర్ని ఫోన్‌దగ్గర పెట్టటం గుర్తుకొచ్చి ఫోన్ వైపు చూసి...]

ప్రమో: భజగోవిందం! ఆపేపరిట్తే...

[భజగోవిందం ఫైలు టేబిలుమీద పెట్టి పరుగెత్తుకెళ్ళి పేపర్తీసుకొచ్చి రెండుచేతుల్తోనూ పట్టుకుని ప్రమోదరావు కిస్తాడు. ప్రమోదరావు పేపర్చదువుతూ తాపీగా...]

ఆఁ...ఏవిటోయ్ కబుర్లు?

భజ : ప్రపంచం ... చుచును... ఎంత పాడయి పోయిందండీ!? అన్న ... నారాయణా' అంటే బూతుమాట. నలుగుర్తో మంచిగా వుంటూ కాలం గడుపుకునే వాళ్ళకి రోజులు కావండి...దీంతుంపతెగ ప్రపంచం ...చు...గు...పాడయి పోయిందండి.

ప్రమో : ఏవిటోయ్? ఏం జరిగింది?

భజ : జరిగేందుకింకేం వుందండి?!... ఈ ప్రపంచం యెప్పుడోనే పాడయిపోయింది అయ్యా! ఆయనెవరో...ఆయనెవరో ఏఁటన్నాడండి?... ఉపకారికి నుపకారము విపరీతము గాదు సేయ వివరింపంగాన్...అని అన్నాడాండీ!? దానర్థం ఈ ప్రపంచానికి తెల్సా? మేలుచేసినవాడికి మనం చెయ్యగలిగితే తిరిగి మేలుచెయ్యాలి. అలా చెయ్యటంలో పెద్దగా చెప్పుకో వల్సిందేమీలేదనే గదండి దానర్థం. అలా తిరిగి మేలు చెయ్యలేని నాబోటి అల్పులు ఆ జన్మాంతర కృతజ్ఞతన్నా చూపించాలి. అది కనీసధర్మం కదండీ. కానీ అలాచేస్తే ఈ ప్రపంచానికి గిట్టదండి. అలా కృతజ్ఞత చూపిస్తే ఏవిటేవిటో...ఏవిటేవిటో అనేస్తుంది సార్ ఈ ప్రపంచం ... ఏం ప్రపంచంసార్...చుచు...పాడయిపోయింది. ఇవ్వాళ నేం చెపుతున్నాను గుర్తుంచుకోండి సార్—ఇవ్వాళ మీదగ్గిర నిలబడి చేతులు కట్టుకుని చెపుతున్నాను గుర్తుంచుకోండి... ఈ ప్రపంచం (ఏదో అనబోయి)...ఎందుకు లెండి! చూస్తూ వుండండి నాశనం—నాశనం— అయిపోతుంది... ప్రపంచం... ప్చ్ప్చ్ ... పాడయి పోయిందిసార్.

ప్రమో : ఒరి నీ ప్రపంచం నువ్వూ నాశనంగాను! సంగతిచెప్పకుండా యేవిటో నీగోల?

భజ : అదే చెప్తున్నానండీ! విశ్వాసం చూపించే నాబోటివాణ్ణి కుక్కగాచూసి గౌరవించాల్సిందిపోయి యిలా వెధవ కింద కట్టేస్తున్నాదాండీ ఈ ప్రపంచం...వాడు వాడండీ... ఆ రవిగాడు...కవిట! ఎంతెంత మాటలన్నాడండి? యింకా పైగా కవిత్వంలో తిట్టాడండీ ... బోడిముండా కవిత్వం వాడూనూ!... తిట్టటానికీ, కొట్టటానికి కూడా కవిత్వంట!!...వెధవ ముండా కవిత్వం నీడగానూ! అంతగా కవిత్వం అఘోరిద్దామనుకుంటే యెవడికన్నా సన్మానపత్రం రాసి పెటొచ్చుగా, బోల్డుమంది డబ్బులిచ్చి సన్మానాలు చేయించుకుంటున్నారుకూడాను...ఇదేదు ...వీడి కవిత్వం నామీద చూపిస్తున్నాడు.

ప్రమో: ఇంతకూ ఏంటంటాడోయ్‌వాడు?

భజ: అంటె వూరుకుంటానా సార్? ...వీడి బోడిముండా కవిత్వం నాక్కు రాక్క పోవచ్చు గానీ అంటే వూరుకుంటానా? ...యింతకు పూర్వం యేదోలే క్షుద్రవెధవ అని వూరుకున్నమాట నిజమే ననుకోండి. కానీ యిప్పుడు నాలుగూ దులిపేస్తున్నాన్సార్...వాడు అన్న నాలుగు మాటల్నీ యిట్లా యిట్లా వాడి ముందే దులిపేస్తున్నాన్సార్ (అంటూ తన భుజం మీద దుమ్ము చేత్తో దులుపుతాడు). ఇట్లా దులిపేస్తున్నానని వెధవకింకేం చెయ్యటం చేతగాక అనటం మానేసి రాయటం మొదలెట్టాడు. నిన్నండి...నిన్న...యీ కాగితం నామొహాన విసిరిపోయాడండి (అంటూ జేబులోంచి ఒక కాగితం తీస్తాడు).

ప్రమో: ఏం రాశాడోయ్ దాంట్లో...

భజ: ఏవో లెండి (అని కాగితం జేబులో పెట్టుకుంటాడు)...అహ...ఇప్పుడాయన గానే అయిపోయిందిటండి? రేపొద్దున మీరు నాకు ప్రమోషనిచ్చి నాణ్ణి తొక్కి పట్టి ఆ సీట్లోనేవుంది వాణ్ణెత్తిన

యిన్నిన్ని...యిన్నిన్ని...ఫైళ్ళు కొడ్తార్? అప్పుడు...అప్పుడు తెలిసొస్తుంది వాడికి ...సార్...ఆ పై పోస్టు నాకిచ్చి పుణ్యం కట్టుకోండి సార్...

ప్రమో: అది చూద్దాం గానీ...ముందా కాగితంలో ఏం రాశాడో చెప్పు...

భజ: ఏదో లెండి. (నసుగుతాడు)

ప్రమో: తియ్యవయ్యా జేబులోంచి...

భజ: తప్పదంటారా? (అని మెల్లగా కాగితాన్ని తీసి) దీన్ని చూస్తుంటే నాకు అరికాలిమంట నెత్తి కెక్కుతోందండీ... దొంగ వెధవ...వెధవముండా కవిత్వం పీడాను...ఏం రాశాడో చూడండి—

'చెప్పు కొరకు తిరుగు శునకమ్ము
మెప్పు కొరకు తిరుగు భజగోవిందమ్ము'

మీరు దయతో చేస్తున్న సహాయానికి కృతజ్ఞత చూపిస్తానికి మీ యింటిచుట్టూ తిరగటం నేం చేసిన తప్పండి? అందు కనిలా రాస్తాడూ? ఒరేయ్ రవి! అవున్రా ...నేను కుక్కని, ప్రమోదరావుగారికో వందసార్లతడవలు రోజుకు దండం పెడ్తాను ...పెడ్తన్రా...ఆయన్లాంటి ధర్మాత్ముల కోసం గదుర్రా అసలు యీ 'దండం' అనే పదాన్ని సృష్టించింది, విశ్వాసం అంటే అర్థం తెలియని వెధవా?

ప్రమో: [కాగితాన్ని చూసి నవ్వుతూ] మొత్తానికి బాగానే రాశాడోయ్!

భజ: అవున్సార్! ఆఁ...ఏవిటి సార్ బాగా రాసింది? నా గురించా? మీరూ

# విషవలయం

అదే మాటంటున్నారా?

ప్రమో: (నవ్వుతూ) నీ గురించి కాదోయ్...కవిత్వం బాగానే రాశాడంటు న్నాను.

భజ: ఏం కవిత్వం లెండి? బోడిముండా కవిత్వం.........నన్నంటె అన్నాడ్సార్... మిమ్మల్ని...మిమ్మల్నెంత మాటన్నా డండి? పైగా అందరితోనూ అనేస్తు న్నాడు. ప్రపంచం...చు...చు ... పాడయి పోయిందండి... మిమ్మల్నెంతెంత మాటన్నాడూ?' అవ్వ!!

ప్రమో: నీ వెధవ వుపోద్ఘాతంతో చంపక, త్వరగా చెప్పు ఏమన్నాడో...

భజ: 'వాడేమన్నాడంటేనండి... మీరు లంచాలకి లంచాలు మింగేస్తార్ట. ఏ కాగితా న్నయినాసరే లంచం ముట్టందే ముట్టనే ముట్టర్ట ... పైగా దాన్ని తొక్కి పడ్తార్ట...ఇలా ఏవేవిటో అన్నాడండి.

ప్రమో: అహాఁ...అయితే ఆ రవిగాడి వ్యవహారం అంతవరకూ వచ్చిందన్నమాట. 'ఏదో కుర్రకుంక కొత్తగా చేరాడు, పోనీ లే' అని వూరుకుంటున్నా నింతవరకూ. అయితే వీణ్ణి నొక్కి పారెయ్యాల్సిందే, ప్రమోదరావుని విమర్శించిన ఏ గుమాస్తా గాడు పైకి రాలేదు. వీడికి తగిన బుద్ధి చెపుతాను.

(గోపీనాథ్ బయటినుంచి వస్తాడు)

గోపీ: నాన్నా! ఎవరికి బుద్ధి చెపుతా నంటున్నావ్. భజగోవిందానికా! అబ్బే, వీడికి బుద్ధి రాదు నాన్నా...వీడింతే.

ప్రమో: ఏంరా బలాదూర్ వెధవా? ఊరిమీద తిరుగుడయ్యిందా?

గోపీ: తిరుగుడు కాదు నాన్నా...కొత్త ముఖాలకోసం వేట. నేను తీసే సినిమాలో కొన్ని కొత్త ముఖాలకి అవకాశం యిద్దా మనుకుంటున్నాను... మీ రిద్దరూ నా పిక్చర్లో విలన్లు...నాన్నా! అన్నట్టు సినిమా తీసేందుకు డబ్బు రడీ చేశావా?

ప్రమో: ఛ...వెధవా! నీకు సినిమా తీసేందుక్కాదు గదా చూసేందుక్కూడా యివ్వను.

గోపీ: ఆఁ...యివ్వవ్. మరి ఆ లంచం డబ్బులన్నీ యేం చేద్దాం నాన్నా? దానికి తోడు ఆ మూల గదిలో పెట్టెనిండా డబ్బుల్దాచావ్? పోనీ అందులోంచయినా యివ్వు నాన్నా!

ప్రమో: ఛీ...దరిద్రుడా...ఆ డబ్బు సంగతి మాట్లాడకు (అంటూ విసుగ్గా లోపలికెళ్తాడు)

గోపీ: మా నాన్న ఆ పెట్టెలో డబ్బు గురించి మాట్లాడితే చాలు, ఆ చుట్టు పక్కలుండడు. అదంతా బ్లాక్ మనీ-నూ? ...[భజగోవిందం వైపు తిరిగి] భజగోవిందం ఆ డబ్బు గురించి నీకు తెల్సా?

భజ: 'బాబ్బాబు! (నన్నడక్కండి' అన్నట్టు మొహం పెడ్తాడు).

గోపీ: ఆఁ...భజగోవిందం! యివ్వాళ మా నాన్న చుట్టూ భజన్చేసి గోవిందలు కొట్టావా? ఏదీ యింకొక్కతడవ చెయ్యి.

[భజగోవిందాన్ని కవ్వించేసరికి భజ గోవిందం ముందు, వెనకాల గోపీనాథ్ కుర్చీ చుట్టూ పరుగెత్తుతాడు]

గోపీ: ప్రమోదరావు చుట్టూ తిరిగి భజన్చేస్తే ప్రమోషనొస్తుంది. నీకు తెల్సుగా? నాకు తెలియకేం ... నువ్వసలే కాకాసురుడివి, కాకాసురా ది గ్రేట్‌వి...

భజ: ఏం మాటలవి గోపీగారు...ఆఁ ...మీరిట్లా తిరుగుతూ నాన్నగార్ని బాధ పెట్టొచ్చా? ఎందుకు మీకీ సినిమా పిచ్చి? ఇంకా సినిమా తియ్యాలనే పిచ్చి పోలేదా?

గోపీ: ఎట్లా పోతుంది? ఇంకా ఒక పిక్చరయినా తియ్యందే...ఆఁ (టేబిలు మీదున్న ఫైలు తెరచి) యిదేవిటి?



మీ ఆఫీసు కాగితం కాదూ?

భజ : అవునండి.

గోపీ : (డిటెక్టివ్ పోజులో) ఎట్లా కనుక్కున్నానో చెప్పు?

భజ : మీరే చెప్పండి...

గోపీ : చెప్పుతాను భజగోవిందం... ఇదిగో చెప్పు...యిటువేపు నీ కాలి చెప్పు గుర్తు...యిటువేపున మానాన్న కాలి బూటు గుర్తు. లంచం వచ్చేంతవరకూ యీ కాగితాన్ని తొక్కిపట్టుంచారు మీ యిద్దరూ. అందుకే యీ గుర్తులు పడ్డయ్. కాకాసురా! మీ యిద్దరిమీద సినిమాతీసిపారేస్తాను. ఇప్పుడే రవిదగ్గర కెళ్ళి యీ 'కాగితం' ప్లాటుమీద కథ రాయమంటాను. (లోపలికి చూస్తూ) నాన్నా! నీ కథే తీస్తాను; డబ్బు సిద్ధం చెయ్యి; వస్తాను (బయటకు పోతాడు).

(ప్రమోదరావు ప్రవేశం)

ప్రమో : ఏడీ యీ వెధవ! వెళ్ళిపోయాడా? వీడితో నాకు మనశ్శాంతి లేకుండా పోతోందోయ్ [అంటూ కుర్చీలో కూలబడతాడు].

భజ : ఆఁ... ఏదో యింకా చిన్నతనం కదండీ... [ఆవలించి] నిద్దరొస్తోంది. యిహ ఆఫీసు కెడ్తానండి.

ప్రమో : సరే ... పో...ఆఁ ... భజగోవిందం? కాస్సేపాగి మళ్ళీ యిక్కడకు రా...నీతో పనుంది...

భజం : చిత్తం...అలాగేనండి [భజగోవిందం సైకిలుతీసుకుని బయటకు వెళుతూవుండగా శోభనాద్రి ప్రవేశిస్తాడు. భజగోవిందం శోభనాద్రికి దండం పెడ్తాడు. శోభనాద్రి భజగోవిందం వీపుమీద ఒక దెబ్బకొట్టి — 'భజగోవిందం! భజగోవిందం! గోవిందంభజ మూఢమతే!' అంటూ సోఫాదగ్గర కొస్తాడు]

ప్రమో : శోభనాద్రీ! రా. రా...

[శోభనాద్రి సోఫాలో కూర్చుంటాడు]

శోభ : ఏం ప్రమోదం! ఆయనొచ్చాడా?...అదేదో ముతక సామెత చెప్పినట్టు మొత్తానికి నువ్వా సంగతి పోనీ చెప్పనేలేదు...ఆయన పేరేంటింతకూ...

ప్రమో : ఆయన పేరు శేఖర్‌బాబు... దేశం మొత్తంమీద ఆయనకు బోల్డు వ్యాపారాలున్నయ్; అలాంటివాడు మనకి బాగా పనికొస్తాడు గదూ? అందుకే మొన్న క్లబ్బులో పట్టుకున్నాను [చేతివాచీ వంక చూసి] వచ్చేస్తూ వుంటాడీపాటికి.

శోభ : అయితే యిప్పుడే అన్నీ మాట్లాడేద్దామా?...నా లారీల్ని మన సరుకుని తీసికెళ్ళేందుకుంచేత్తాను. అయిప్పుడు అయిదరాబాదెళ్ళబోతన్నయ్.

ప్రమో : అబ్బే...అవన్నీ యిప్పుడు కాదు; తర్వాత...యిప్పుడు నిన్నాయనకి పరిచయం చేస్తాను.

శోభ : (నవ్వి) ఆఁ...నువ్వేంటి పరిశయం చేసేదాయన్ని... ఆయన్ని నేను క్లబ్బులో చూసేశాను; నువ్వు పరిశయం సేసేతేంటి? !... అదేదో ముతక సామెత చెప్పినట్టు ముండామోసిన మూడేళ్ళకి...

ప్రమో : అబ్బబ్బ! శోభనాద్రీ! నీ ముతక సామెతలాగలెయ్యి...అవిప్పుడు చెప్పకు.

శోభ : ఒయ్! నీకు తెల్దులే ప్రమోదం! ముతక సామెతల్చెప్పకబోతే అందరూ మనం మెతకోళ్ళ వనుకుంటారు...ఆఁ యింతకూ ఆయన్నాకెట్టా పరిశయం అయ్యాడని అడగవేం?

ప్రమో : ఆఁ ... ఎట్టా పరిచయం అయ్యాడు?

శోభ : ఆఁ...అట్టా. అడుగు సెబుతా. ఏంలేదు, ఆయాల క్లబ్బులో వుపన్యాసం యిత్తన్నాడు. పిల్లాడు పీసులావున్నా చాకులా మాట్టాడేత్తన్నాడు. కానీ మైకు దగ్గర నిలబడి మాట్టాడ్డే నాయాలు! అటూ యిటూ తిరుగుతూ మాట్టాడ్తన్నాడు. అహా ... నాకు తెలియకడుగుతా, వుపన్యాసం అట్టాగేనా యిచ్చేది? గట్టిగా మైకట్టుకుని బల్లగుద్ది సెప్పాలా వద్దా? అహ ... అదేంలేదు నేనెప్పుడు పన్యాసమిచ్చినా గట్టిగా మైకట్టుకుని యిత్తాను ఆ...మొన్న ఎలక్షన్లో ఏంవయిందో తెల్సా?...ఏవయిందని అడుగవేం అడుగెహ!

ప్రమో : ('పూఫ్' అని) ఆ ఎలక్షన్ల సంగతి నేనడగన్లే...అబ్బబ్బ...కదిలిస్తే వూరుకోవుగదా. అడగమనిచెప్పి మరీ మొదలెడ్తావ్. అపమంటే ఆపవ్...నాయకుడి లక్షణాలన్నీ వున్నట్టున్నయ్...

శోభ : ఉన్నట్టుండటమేంటి ప్రమోదం? అచ్చు గుద్దినట్టున్నయ్. అసలు అరవయ్యేడెలక్షన్లోనే పైకి...యేదీ... ఆ...ఢిల్లీ కెళ్ళిపోవాల్సినోణ్ణి కదూ? ఖర్మం కలిసిరాక యింకా మునిసిపల్ ఎలక్షన్లలోనే కొట్టుకుంటున్నాను...అ... ఎలక్షన్లలో ఏవయిందో అడగనేలేదు... పోనీ నా క్లబ్బులో ఏం జేశానో మరి అదన్నా అడుగు... అడుగెహ (అంటూ ప్రమోదరావు వీపుమీద కొడతాడు)

ప్రమో : అడక్కపోయినా నువ్వూరుకుంటావా? చెప్పు.

శోభ : ఆ... అట్టా అడుగు. పిల్లాడు పీసులావున్నాడన్నానా? అటూ యిటూ



తిరిగి మాట్లాడుతున్నాడు కోటుజేబులో చేతులెట్టుకుని. అదేదీ...ఆ అమెరికానో, రష్యానో ఆ ... పారినో ఎల్లొస్తారే... ఆళ్ళు మాట్లాడినట్టు మాట్లాడుతున్నాడు...మాటలేవో మైకులో యినబట్టల్లేదు. నాకు 'ఛర్' మని కోపవొచ్చింది గబుక్కున లేగిసి నిలబడ్డాను. నిలబడి— 'వోయ్! ఆ మైకు దగ్గర నిలబడి మాట్లాడవో' అన్నాను ... నాయాలు (నవ్వుతూ) ... అప్పట్నుంచీ అట్టానే మాట్లాడాడు...ఆడికి నే బాగుర్తే...

ప్రమో: వారి నీపరిచయం తగలెయ్యా! ఇదన్నమాట నీ పరిచయం. సరే యిప్పుడు నేనాయన్ని పరిచయం చేసినప్పుడివేమీ మాట్లాడకు...

శో: వో...నే నూరుకుంటా. నేంటి? ఇక్కడకూడా అటూ యిటూ తిరుగుతూ మాట్లాడ్తే—'వోయ్! నీ యెచ్చుమండా... వో చోటు నిలబడి మాట్లాడవో' అంటాను; అంటానంతే. నా కియన్నీ అలవాటే...యీ యాపరంలోకీ, మరీ రాజకీయాల్లోకి దిగక పూర్వం ఏం జేసేవాణ్ణో తెల్సా?...ఏం జేసేవాణ్ణని అడగవేం...

ప్రమో: నేనవేవీ అడగను గానీ నువ్వు నోరు మూసుకూర్చో...ఆఁ... ఆయనొస్తున్నారు.

(శేఖర్ బాబు ప్రవేశం. శేఖర్ బాబుని చూచి ప్రమోదరావు లేచి నిలబడతాడు.,

# విప్లవలయం

అతడి తర్వాత శోభనాద్రి కూడా లేస్తాడు.)

శేఖర్: (ప్రవేశిస్తూ) హల్లో! గుడ్‌మార్నింగ్ జెంటిల్‌మన్!

ప్రమో: గుడ్ మార్నింగ్ సర్! (శేఖర్‌కి షేక్‌హ్యాండిస్తూ) వీరు శోభనాద్రిగారు. రోడ్డు ట్రాన్సుపోర్టు వ్యాపారం...అప్పుడప్పుడూ మున్సిపాలిటీ రాజకీయాల్లోకి కూడా దిగుతూ వుంటారు.

శేఖర్: (శోభనాద్రికి షేక్‌హ్యాండిస్తూ) గ్లాడ్ టు మీట్యూ. అయితే మా ప్రోడక్ట్సుకి యీ రీజియన్లో ఏజెన్సీ మీ కప్పగించొచ్చన్న మాట... వెరీ గుడ్... నా ప్రాబ్లెమ్ ఒకటి సాల్వయ్యింది.

ప్రమో: అది ఆయనె అడగాలనుకున్నారు. మీరే చెప్పేశారు. చాలా సంతోషం.

శేఖర్: ఓ...నే నేదీ ఒకళ్ళు చెప్పేదాకా ఆగను...అదీగాక దీన్ని గురించి మీరు క్లబ్బులో నాకు చెప్పారు గూడాను. పైగా యిందులో ఒకళ్ళ కొకళ్ళు చేసిపెట్టే లాభం ఏమీ లేదు. నాకు ఏజెంట్సు కావాలి (శోభనాద్రి వైపు తిరిగి) మీకు బిజినెస్ కావాలి. అంతే... జస్ట్ బిజినెస్...ఆఁ...అన్నట్టు మీరు రాజకీయనాయకులు కూడానా?

ప్రమో: ఏదో చిన్నసైజు. మునిసిపాలిటీ లెవెలు...

శోభ: ఆ... చిన్నసైజేంటి ప్రమోదం! పెద్దసైజే (శేఖర్ బాబు వైపు తిరిగి) ఢిల్లీ ఎల్లిపోదామనుకుంటుండాను.

శేఖర్: వో వెరీగుడ్...నాయకులంటే నాకు చాలా అభిమానం...యింతకూ ఏ పార్టీ మీది?

శోభ: [గట్టిగా నవ్వేస్తూ] ఏం ప్రశ్న యిది...మళ్ళీ వచ్చే ఎన్నికల్దాకా యింకా ఏ పార్టీనో నిర్ణయించుకోలేదు. అదేదో ముతక సామెత చెప్పినట్టు [ప్రమోదరావు వంక చూస్తే అతడు కోపంగా చూస్తాడు. అందుకని మధ్యలో ఆపేసి]......అహ...రాజకీయాలు గుర్రప్పందాల్లాంటివి గదండీ...గుర్రప్పందాల్లో ఏ గుర్రం గెలుస్తదనుకుంటే ఆ గుర్రంమీద పందెంగాస్తాం. అట్టానే ఏ పార్టీ గెలుస్తదనుకుంటే ఆ పార్టీ టిక్కెట్టు తీసుకుంటాం., అంతే. వోయ్ ...మీకు...మీకు తెలుసో తెలియదో., ఇంత వరకూ నేను మూడు పార్టీలు మారాను. ...ఏ పార్టీలని అడగరేం... (శేఖర్ బాబు భుజంమీద కొడుతూ) అడుగేహ...

శేఖర్: (శోభనాద్రివంక నిర్లక్ష్యంగా చూచి, అతడు కొట్టినచోట సిగరెట్టు పొగ వదలి) వో...అక్కర్లేదు. అడిగితేనే గానీ సమాధానం యివ్వరన్న మాట. గుడ్. మీరు తప్పకుండా ఢిల్లీలో వుండాల్సిందే... (టైము చూసుకుని) వో... ఇటీజ్ టైం ఫర్ మి టు టేక్ రెస్ట్ ...ఐ హేవ్ బీన్ బిజీ ఆల్ ఎలాంగ్ (అని వొళ్ళు విరుచుకుని నిలబడ్డాడు. ఇది చూసి ప్రమోదరావు కుర్చీలోంచి లేస్తాడు. బలవంతంగా శోభనాద్రి కూడా లేస్తాడు.)

ప్రమో: మేం అలా బయట కెళ్తాము...ఆ మేడమీది గది మీకోసం ఏర్పాటుచేశాను. అక్కడ రెస్టు తీసుకోండి ఇవ్వాళ నౌకర్లకు శలవిచ్చాను. మీ సూట్‌కేసు పైన పెట్టమంటారా...

శేఖర్: వో...అక్కర్లేదు. నేను తీసుకెడతాను (అని సూట్‌కేసు చేతిలోకి తీసుకుంటాడు)



ప్రమో : (మెల్లగా) ఆ...నేనో బిజినెస్ సంగతి మీతో మాట్లాడాలన్నాను చూశారూ?

శేఖర్ : ఎస్...ఎస్...అన్నారు.

ప్రమో : దాన్ని గురించి కాస్సేపు మీరు రెస్టు తీసుకున్నాక మాట్లాడ్దాం. మేమలా బయట కెళ్లొస్తాం.

శేఖర్ : వో. కె. (అంటాడు యిల్లంతా చూస్తూ)

ప్రమో : వస్తాం. (అని శోభనాద్రిని నెట్టుకుంటూ తీసుకుపోతాడు)

శోభ : (స్టేజి ఎడమవైపు చివరకు వెళ్లాంతర్వాత) బలేగా వుందే యవ్వారం ...బాణం వచ్చినట్టొచ్చి మనల్ని బయటకు పంపేత్తన్నాడే...లదేదో ముసక సామెత చెప్పినట్టు...

ప్రమో : ష్...ద (అని శోభనాద్రిని లాక్కెడతాడు).

(శేఖర్ కాస్సేపు యింటిని పరిశీలించి హుషారుగా మేడమెట్లెక్కబోతూ ప్రక్కన ఫోన్ దగ్గర ఏదో మేగజైన్ చూసి మెట్టుదిగి ఆ మేగజైన్ చూస్తూ వుంటాడు...రవి ఒకచేతిలో ఫైలుతో ప్రవేశం)

రవి : ప్రమోదరావుగారున్నారాండీ!

శేఖర్ : (రవి వంక చూడకుండానే) లేడు.

రవి : వారొచ్చాక యీ ఫైలివ్వండి (అంటూ శేఖర్‌కు ఫైలివ్వటానికి ముందుకెడతాడు. శేఖర్ విసురుగా యిటువైపు తిరుగుతూ)

శేఖర్ : నే నెవ్వరో తెలియకుండా ఏవిటీ అడ్డమైన పనులన్నీ పురమాయిస్తున్నావ్? (అని రవిని పూర్తిగా చూసి హో... నువ్వు రవివి కాదూ... ఏం చేస్తున్నావి వూళ్లో?

రవి : ప్రమోదరావుగారి ఆఫీసులో క్లర్కుగా వుంటున్నాను...మీకు నాపేరెలా తెల్సు?

శేఖర్: ఓ ... అదా ?...యిందాక నీ గురించి కొంత ప్రమోదరావు చెప్పాళ్లే, ఊం...ఆదర్శాలు, నీతి, నిజాయితీఅంటూ చాలా ఆవేశంగా మాట్లాడ్తావట. ఈ ప్రపంచంలో లేని విషయాలపై యెందుకు నీ కంత మోజు?

రవి : అవును...నీతి, నిజాయితీ ... యివన్నీ ఈనాడు ప్రపంచంలో లేని విషయాలే ... ప్రమోదరావులూ శోభనాద్రులూ, భజగోవిందాలూ వుంటే ఈ ప్రపంచంలో నీతి నియమా లెక్కడుంటయ్, ఎట్లావుంటయ్?

శేఖర్ : థాంక్యూ ! నా పేరుకూడా శోభనాద్రీ, ప్రమోదరావుల లిస్టులో చేర్చలేదు.

రవి : మీ పేరు నాకు తెలియదు.

శేఖర్: తెలిస్తే చేరుస్తా వన్నమాట. బతికాను, నా పేర్చెప్పానుకాదు. అయినా నా సంగతి తెలియకుండా నన్నుకూడా ఎలా చేరుస్తావ్ ఆ లిస్టులో ...

రవి : వేరే యింకా యేం తెలియాలి ...నీతి, అవినీతి ఒక్కచోట వుండలేవు ...ప్రమోదరావు ప్రక్కన అలాంటి అవినీతిపరులే వుంటారు.

శేఖర్ : ఎప్పుడూ నువ్వు అర్థం లేని విషయాలే మాట్లాడ్తావ్‌లావుందే!? లేకపోతే ఏవిటో 'నీతి—అవినీతి'అంటూ మాట్లాడ్తా వేస్పుడూ ! నీ కబుర్లు వింటుంటె నాకో అనుమానం వేస్తోంది. నువ్వు నాటకాల్లోగనీ, సినిమాల్లోగానీ హీరోవేషా లేస్తూ వుండాలి. బహుశ ! నాటకాల్లోనే అయ్యుంటుందిలే. ఎందుకంటే సినిమా హీరో కి వీట్నిగురించి ఆలోచించాల్సిన అవసరంగానీ, టైంగానీ వుండదు ... నువ్వు కథలుకూడా రాస్తూ వుండాలి. అందుకే ఈ నీతి—అవినీతుల డయలాగులకి బాగా అలవాటు పడ్డావ్... బ్రదర్ ! ఒకటిమాత్రం గుర్తుంచుకో. యివన్నీ కథల్లోనూ, నాటకాల్లోనూ చెప్తానికి చాలా బాగుంటయ్, కానీ మన జీవితాల కేమాత్రం వుపయోగపడవ్.

రవి : ఎందుకుపయోగపడవ్? మంచిగా వుండేవాళ్లు మొదట్లో కొంత బాధ పడ్తారు. మంచితనాని కెప్పుడూ ఈ పరీక్ష లుత్తున్నవ్. కానీ చివరకు విజయం మంచివాళ్లదే...

శేఖర్ : చివరికి...హహ్హాహ్హా... అంటే చచ్చిపోయేముందా బ్రదర్ ! చచ్చేముందెవడు గెలిస్తేనేం ? నీకు దేవుడు మనిషినెందుకు సృష్టించాడో తెల్సా ? చస్తూ బ్రతకమనా ? బాగా బ్రతికి చావమనా ?! మనిషి కెలాగూ చావు తప్పదు. కానీ చచ్చేలోగా బ్రతకాలి. బ్రతకటం అంటే జీవించటం కాదు బ్రదర్ ! జేబుల్నింపటం ! బ్రతికేటప్పుడు జేబుల్నింపుకుని బాగా బ్రతకాలి. ఈ సంఘం డబ్బున్నవాళ్లనే బ్రతకనిస్తుంది — యిష్టం వచ్చినట్టు బ్రతకనిస్తుంది. పైగా బోల్డు బోల్డు గౌరవిస్తుంది కూడాను.

---

డాక్టర్ శ బుజ్జ

## పార్కిన్సన్ వ్యాధి

పార్కిన్సన్ వ్యాధిని 'పెరాలిసిస్ ఎజిటాన్స్' అనికూడా అంటారు నిజానికి పెరాలిసిస్ ఉండదు. కండలు బిగుసుపోయి క్రమంగా నశించిపోతాయి. వాటికి వ్యాయామం అవసరం. ఈ రోగం ఉన్నవారు వంగి, చకచక నడుస్తారు.

వ్యాయామం ఎలాగ ఉండాలి? నడిచేటప్పుడు కాళ్లూ చేతులూ బాగా ఆడించి నడవాలి. వీలయితే నేల మీద పుస్తకాలని అడుగు అడుగు దూరంలో పరిచి వాటిని దాటుకుంటూ నడవాలి.

మెడ, భుజాలు, కాళ్లు,



మోకాళ్లు, మడమలు, కాలి వేళ్లు బాగా వ్యాయామానికి లోనవాలి.

(కాపీరయిటు)

# విషవలయం

రవి : హాఁ...ఈ సంఘం గ్రుడ్డిది! అందుకే అలా ప్రవర్తిస్తోంది.

శేఖర్ : నేను 'ఈ నాడు యిలా జరుగుతోంది' అని చెపుతున్నాను గానీ అందుకు కారణాలు కావు. అవి నా కనవసరం. అందుకే సంఘం గౌరవించే విషయాల్నే నేనూ ఆచరించటం మొదలెట్టాను. నేనూ నీమాదిరే కొన్నాళ్ళు నీతి, నియమాలంటూ అఘోరించాను. బ్రదర్! ఆ రోజుల్లో నే పడ్డపాట్లు కుక్కలు కూడా పడుండవ్. అందుకే కాలాను గుణ్యంగా మారాను. ఈ ప్రవాహం వాలులో వడ్డాను. ప్రవాహానికి ఎదురీదటం తెలివైన పనికాదు, తెలివైనవాడి లక్షణమూ కాదు.

రవి : అవును, తెలివైనవాడి లక్షణం కాదు! అవకాశవాదిలా అంతరాత్మను చంపుకుని బ్రతకాలి. ఇదేనా మీ సిద్ధాంతం?

శేఖర్ : బ్రదర్! యిప్పటికే ఈ నీతి, నిజాయతీలంటే అర్థం తెలియక ఏస్తున్నాను. వాటికితోడు ఈ అంతరాత్మనికూడా తీసుకురాకు రంగంమీదికి.

రవి : తప్పుచేసేవా డెప్పుడూ నిజాన్ని తప్పించుకు తిరుగుతూ వుంటాడు. మీరూ అంతే.

శేఖర్ : నీతో వాదించే అవసరంగానీ, ఓర్పుగానీ నా కిప్పుడు లేవుగానీ— ఒక విషయం మాత్రం నిజం. డబ్బులేని నీతి నియమా లెందుకూ పనికిరావు రవీ! అంతేకాదు, నీతి నియమాలంటూ పట్టుక్కూర్చునేవాడ్దగ్గరికి డబ్బు రాదు బ్రదర్! ఇది నాకు జీవితం నేర్పినపాఠం. అందుకే నేనిలా తయారయ్యాను. నన్నింకా గుర్తు పట్టలేదు కదూ? అవును ...మనం కల్సుకుని చాలా ఏళ్ళయ్యింది. నేను రవీ! శేఖర్ని!!

రవి : శేఖర్! నువ్వా?! ఏమిటి? ఇక్కడేం చేస్తున్నావ్?!

శేఖర్ : ఉద్యోగం ఏమీలేదు రవీ! కానీ వో పెద్దవ్యాపారం చేస్తున్నాను. విట్లెస్ట్ వీళ్ళ నలా నమ్మిస్తున్నాను!... జీవితంలో డబ్బు లేకపోవటంవల్ల వచ్చే అనర్థాలేమిటో తెల్సుకున్నాను. అందుకె ఈ క్లాస్ సొసైటీతో సంబంధాలు పెట్టుకోవాలని తాపత్రయం.

రవి : ఈ సంబంధాలవల్ల నీ కొచ్చే లాభం ఏమిటి శేఖర్? వాళ్ళ దుర్గుణాలు నీకు పట్టుబడతయ్ తప్ప.

శేఖర్ : డబ్బున్నవాళ్ళవి దుర్గుణాలెందుకవుతయ్ రవీ! వాళ్ళవన్నీ మంచి గుణాలే. నువ్వీ డబ్బున్నవాళ్ళ నెన్నయినా తిట్టు. కానీ వాళ్ళంటె నాకు చాలా యిష్టం. ఎందుకో తెల్సా? డబ్బున్న ప్రతివాడూ బ్రతకనేర్చినవాడే, బ్రతకనేర్చిన ప్రతివాడి దగ్గరికీ డబ్బొస్తుంది. ఈ ప్రపంచంలో డబ్బున్న ప్రతివాడూ పెద్దమనిషే. ఇలాంటి పెద్దమనుష్యుల్తో భుజాలురాసుకు తిరగాలని నాకు సరదా. రబ్బింగ్ షోల్డర్స్ విత్ క్లాస్ పీపుల్ ఈజ్ ఎ ప్లెషర్ ఫర్ మి రవీ! ఈ 'క్లాస్' పీపుల్తో భుజాలురాసుకు తిరగాలనే వాంఛ ఈ ప్రపంచంలో ప్రతివాడికీవుంది నీకు తప్ప.

రవి : హుఁ... నువ్వెవరితో నైతే భుజాలు రాసుకు తిరగాలని చూస్తున్నావో వాళ్ళీ సమాజంలో వుండే ప్రతి అవినీతికీ మారుపేర్లు. అందుకే అవినీతి పేర్చెప్పితే భుజాలు తడుముకుంటారు. ఈ ప్రమోదరావునే చూడు... వీడో స్కాండ్రల్, చీట్, సోషల్ పేరసైట్.

శేఖర్ : (వెంటనే అందుకుంటూ) ప్రమోదరావొక స్కాండ్రల్, చీట్, సోషల్ పేరసైట్, రోగ్—నేనూ వొప్పుకుంటాను — అందుకే వాడ్దగ్గర డబ్బుంది. అందుకే వాడంటె నాకాపేక్ష. ...మొదట్నుంచీ నాదో వింత మనస్తత్వం రవి! నీకు గుర్తుందా? మనం బెజవాడ కాలేజీలో చదివేటప్పుడు నువ్వు రాసిన నాటకాలు మన కాలేజీలో వేస్తూ వుండేవాళ్ళం. నువ్వూ, రమణమూర్తీ ఎప్పుడూ హీరో వేషం కావాలని పోట్లాడుకునేవాళ్ళు. మాసిన గడ్డం చిరిగిన గుడ్డలు వేసుకునే ఆ హీరో పాత్రంటే మీరెందుకు పడి చచ్చేవాళ్ళో నాకర్థం అయ్యేదికాదు. నువ్వలాంటి హీరోల్ని ఎందుకు సృష్టించేవాడివో అంతకంటే అర్థం అయ్యేది కాదు. నన్ను కూడా వేషం వెయ్యమన్నప్పుడు నేనేం చెప్పేవాణ్ణో నీకు గుర్తుందా?

రవి : గుర్తు లేకేం గానీ...అవన్నీ యిప్పుడెందుకు చెపుతున్నావో మాత్రం అర్థం కావటంలేదు.

శేఖర్ : అర్థమవుతుంది రవీ! నా మనస్తత్వం ఎలాంటిదో తెలియచేసేందుకే యివన్నీ గుర్తు చేస్తున్నాను. మీరు నన్ను కూడా వేషం వెయ్యమని అడిగినప్పుడల్లా ఈ ప్రశ్న వేసేవాణ్ణి: 'మీ నాటకంలో ఉలెన్‌సూటు వేసుకుని, చేతిలో సిగరెట్టుతో జమీందారీ హంగులన్నీ వున్న పాత్రేమన్నా వుందా?' అని. అలాంటిపాత్ర నాటకం మొత్తంమీద ఒక్క నిమిషం వున్నా నేనదే తీసుకునేవాణ్ణి. జీవితంలో కూడా అలా వుండాలని నా వాంఛ రవీ! డబ్బు లేకపోవటంవల్ల వచ్చే బాధలేమిటో నేను పూర్తిగా అనుభవించాను. అన్నంలేక పస్తులుండి మా అమ్మ దారుణమయిన పరిస్థితుల్లో చచ్చిపోతూ వుంటే చేతిలో కాసి లేని నేను ఏడుస్తూ చూస్తూ కూర్చున్నాను రవీ! అమ్మని నేనే చేతులారా చంపాను రవీ! చంపాను (ఏడుస్తూ అంటాడు).

రవి : ఆఁ... మీ అమ్మగారు చనిపోయారా?

శేఖర్ : అదొక్కటే కాదు బ్రదర్! పెళ్ళీడుకొచ్చిన నా చెల్లెలు రమ పెళ్ళి చెయ్యలేని నా అసమర్థతవల్ల, నాకు గుండెలమీద కుంపటిలా వుండటం యిష్టంలేక ఆత్మహత్య చేసుకుంది...

రవి : (బాధగా శేఖర్ దగ్గరకు వెళ్ళి భుజంమీద చెయ్యివేస్తూ) శేఖర్!

శేఖర్ : నాకు సానుభూతి చూపించొద్దు రవీ! వద్దు...ఈ రెండు సంఘటనలు నా కళ్ళు తెరిపించినయ్. అంతవరకూ ఈ డబ్బున్నవాళ్ళంటే నాకు కసి, ద్వేషం—అందువల్ల నేను బాగుపడిందేమీ లేదు. నా వాళ్ళందర్నీ చంపుకున్నాను ... అప్పటినుంచీ వాళ్ళతో స్నేహము తిరిగేందుకు ప్రయత్నిస్తున్నాను.

రవి : దానివల్ల నీకొచ్చే లాభం ఏమిటి శేఖర్?

శేఖర్: లేకేం రవీ! వాళ్ళది కష్టపడి సంపాదించిన డబ్బుకాదు. చుట్టూవుండే నాలాంటివాళ్ళమీద యిష్టం వచ్చినట్టు ఖర్చుపెడతారు. అందుకే వాళ్ళతో తిరగ

# లిప్టన్ రూబీ డస్ట్

## డస్టు టీలలో చక్రవర్తి







లిప్టన్స్ అంటే మంచి టీ

# విపవలయం

టింలో లాభం వుంటి. నేనూ — నువ్వూ కల్సి తిరిగితే ఏం లాభం బ్రదర్!... బూడిద···మా బజార్లో వుండే ఓ ఆఫీసర్ని 'హలో! గుడ్‌మార్నింగ్ సర్!' అంటూ దూసుకుపోయి వాడి వెంట తిరిగే వాణ్ణి, అలానే యింకో లాయర్ని, యింకో మార్వాడీని···యిలా...యెందరో... యెందర్తోనో తిరిగేవాణ్ణి. క్రూడ్‌గా చెప్పాలంటే 'కాకా' పట్టేవాణ్ణి. కానీ బ్రదర్! 'కాకా' పట్టటానికి నా ఆత్మాభిమానం అడ్డొచ్చేది. ఈ ఆత్మాభిమానం అనేదుంది చూశావ్, యిదీ మిడిల్-క్లాసుకుండే ఓ పెద్ద జబ్బు.

రవి: ఆత్మాభిమానాన్నలా తీసిపారెయ్యకు. ఆత్మాభిమానం లేని మనిషి పశువుతో సమానం.

శేఖర్: రవీ! నీ దారి వేరు, నాది వేరు. అందుకే నీతో వాదించదలుచుకోలేదు. కానీ ఒకటి మాత్రం నిజం. నేను నా ఆత్మాభిమానాన్ని చంపుకోలేకపోయాను. నే నిలా 'కాకా' పడుతూ పై వాళ్లతో తిరిగే రోజుల్లో ఏవయ్యేదో తెల్సా బ్రదర్! ఈ డబ్బున్న వెధవలున్నారే, వీళ్లకో పెద్ద జబ్బుంది. తమకంటె తక్కువ అంతస్థులో వున్నవాళ్లు తమతో తిరుగుతుంటె వాళ్లనెప్పుడూ చిన్న చూపే చూస్తారు. నిచ్చెన మెట్లెక్కుతూ పైకి పోయేవాడెప్పుడూ పై మెట్టువంకే చూస్తాడు, క్రింద మెట్టుని చూడడు. ఆ రోజుల్లో నన్నూ అలాగే చూసేవాళ్లు వారు. నే నెప్పుడూ వెంటపడి తిరిగే వో బిజినెస్ మెన్ అప్పుడప్పుడూ నన్ను వాడి కార్లో ఎక్కించుకునేవాడు. పిచ్చి వెధవని నేను! వాడి ప్రక్కన కార్లో కూర్చునిపోతుంటె నాకు సర్దాగా వుండేది. దార్లో నడచిపోతున్న నా స్నేహితులకి చెయ్యూపుతూ పోతూవుండేవాణ్ణి. కాని యింతాచేసి ఆ వెధవ నన్ను నా యింటి దగ్గిర దించేవాడుకాదు. ఇంటికో నాలుగొందల గజాలు యివతలో అవతలో దింపేవాడు. నా సర్దా అంతా చల్లారిపోయేది. వాడలా యెందుకు చేసేవాడో తెల్సా? వెధవకి నా పెంకుటింటి ముందు కారాపటం నామర్దా, నామోషి.

రవి: శేఖర్! అందుకే అంతస్థుల్ని మరిచి నిచ్చెనెక్కేవాళ్లతో పూసుకు తిరగటం మంచిది కాదు. ఇప్పటికయినా యీ సరదా మానుకో.

శేఖర్: రవీ! యిప్పటి నా అంతస్థు వీళ్లందరి అంతస్థు కంటే పెద్దది. వాళ్లే నాతో పూసుకుతిరుగుతున్నారు. నా కథ పొంతం విను బ్రదర్!...వాడలా యింటికి దూరంగా దించటంతో నా సర్దా అంతా చల్లారిపోయేది. నాక్కోపం వచ్చేది. కానీ జాగ్రత్తగా ఆలోచించాను. ఈ ప్రపంచంలోని ఒక సత్యం నాకు తెల్సింది. కారున్నవాడు కారున్నవాడికే లిఫ్టిస్తాడు. వాడింటి దాకా వెళ్లి కారు డోర్ తనే స్వయంగా తీసి మరీ దించుతాడు. అందుకే యీ 'కాకా' పట్టే వృత్తికి స్వస్తి చెప్పి నేనో పెద్ద బిజినెస్ మేగ్నెట్‌నని వీళ్లందరికీ యిల్యూషన్ కల్పిస్తున్నాను. ఇప్పుడు నా దగ్గిర డజన్ ప్లిమత్ కార్లు, వో యిరవై డాడ్జిలూ వున్నయ్యని వీళ్ల ఉద్దేశ్యం. కానీ యీ వూరు ప్లేన్‌మీద వొచ్చాను కాబట్టి అవిప్పుడు నా దగ్గిరలేవు. ఈ ప్రమోదరావుగాడు తనకారుని నా కిచ్చేసి నేనీ వూళ్లో వున్నంతకాలం వాడుకోమని వేడుకొన్నాడు. తను ఆఫీసుకి టాక్సీలో పోతున్నాడు. ఎంబాసిడర్‌కంటే ఎక్కువ ఖరీదైనకారు యివ్వలేనందుకు క్షమాపణకూడా చెప్పుకున్నాడు పిచ్చి వెధవ.

రవి: ఇంతకూ ఈ వూరెందుకొచ్చావ్? ఎన్నాళ్లుంటావ్?

శేఖర్: ఎందుకొచ్చానంటావేమిటి రవీ! ఎంజాయ్‌మెంటుకోసం అదే నా బిజినెస్. ప్రతి సిటీ తిరుగుతూంటాను. నే వెళ్లే ప్రతి సిటీలోనూ ముందుగా సిటీలోని బిగ్ షాట్సందర్నీ పిల్చి వో పార్టీ యిస్తాను. అదే నేనుచేసే ఖర్చు. తర్వాతక్కడ వున్నంతకాలం నే నడక్కుండా వాళ్లే నా క్రింద ఖర్చుపెడతారు. ఆ వూరు విసుగు పుట్టంగానే యింకో వూరికి మకాం మార్చేస్తాను...

రవి: ఇట్లా చెయ్యటం మోసం కాదూ? ఈ పాపం బద్దలయ్యి వాళ్లందరూ కలసి నిన్ను జైలుకి పంపిస్తారు.

శేఖర్: హహ్హాహ్హా ... అంత తెలివి తక్కువగా ప్రవర్తిస్తానా బ్రదర్! వూరు విడిచేలోగా వాళ్ల రహస్యాల్లో కొన్నయినా నాకు చెపుతారు. అదే వాళ్ల వీక్‌నెస్. అదే నాకు పెద్ద ఎసెట్. ఆరహస్య విషయాలన్నిటిలోనూ సహాయం చేస్తానన్చెప్పి వాళ్లచేతే ప్లేన్ టికెట్ కొనిపించి ఆవూరొదిలేస్తాను. వెధవలు నా దగ్గర్నుంచి జవాబులేక అల్లాడిపోతారుగనీ నా విషయం ఎవ్వరికీ చెప్పరు. ఎందుకోతెల్సా రవీ! అంతా తేలుకుట్టిన దొంగలే. అలాంటివాళ్లనే నేను పట్టుకుంటాను.

రవి: అయినా యిది మోసంకాదూ?



శేఖర్ : అదే చెప్పబోతున్నాను బ్రదర్! ఏమిటి మోసం? వాళ్ళుచేసే మోసాల్తో పోలిస్తే, యిదెంత? వాళ్లు లక్షలకి లక్షలు అన్యాయంగా సంపాదిస్తారు. అందులో వో యిరవైవేలు నా క్రింద ఖర్చుచేస్తారు. అంతే. వాళ్లు నా క్రింద ఖర్చుపెట్టేది కష్టార్జితంకాదు బ్రదర్! బ్లాక్ మనీ!? అదీగాక నే నడక్కుండానే వాళ్లు నా క్రింద ఖర్చుపెడతారు. ఇది మోసమా? నేను కష్టార్జితంలో బతికే వాళ్ల జోలికే పోను, వాళ్లని రాసుకు తిరిగితే ఏం రాల్తుంది—బూడిద!

రవి: కానీ ఈ ప్రమోదరావు విష వలయంలో నువ్వు చిక్కుకునేట్లు చెయ్యగలడు శేఖర్! ఎందుకనవసరంగా ఈ బాధలు.

శేఖర్ : ప్రమోదరావేవిటి?! నే తిరిగే మనుష్యులందరూ నా చుట్టూ విష వలయాలు సృష్టించగలిగిన పెద్దమనుష్యులే. అయినా నాకలాంటి వాళ్లమధ్య వుండటం చాలా సంతోషం బ్రదర్. బ్రతుకులంటే వాళ్లవీ బ్రతుకులు!

రవి: అయినా నీకెందుకీ సరదాలు? బి. ఏ. పేసయ్యావు; యేదన్నా వుద్యోగం చూసుకోరాదూ?

శేఖర్ : ఏం వుద్యోగం బ్రదర్! గుమాస్తాగానా?! అదిమాత్రం యెక్కడ దొరుకుతుందిప్పుడు? గుమాస్తా పోస్టుకి బి. ఏలూ, ఎమ్మేలేగాక యింజనీర్లుకూడా తగలడుతున్నారు కాంపిటేషనుకి! అదీగాక చేరెడు నీళ్లల్లో చేపలు పట్టే అలవాటు కెప్పుడో నే స్వస్తి చెప్పాను. ఈ లక్జూరియస్ బ్రతుక్కలవాటుపడ్డాను. గుమాస్తాగా బతకలేను; జస్ట్ యింపాజిబుల్.

రవి : శేఖర్! నీ మంచికోరేవాడ్నిగా చెపుతున్నాను. ఈ ప్రమోదరావుతో ఎక్కువగా తిరగటం సెకంత మంచిదికాదు. అన్ని రోజులూ మనవికాదు. [కాస్సేపాలోచించి] అయినా యీ వూరెందుకొచ్చావ్? ప్రమోదరావుకి నీతో ఏమిటి పని?

శేఖర్ : ఈ వూరెందుకొచ్చానో యిదాకే చెప్పాను రవీ! స్నేహితుడివి కాబట్టి నీతో అబద్ధాలు చెప్పలేదు. ఇక పోతే వీళ్లందరకీ ఏం చెప్పానో తెల్సా!? నేనో పెద్ద బిజినెస్ మేగ్నెట్‌నని. నాకు బోల్డు

> గమనిక: ఈ నాటిక ప్రదర్శింపగోరువారు ప్రదర్శనకుముందే రచయితవద్ద మంచి అనుమతిని పొందాలి. రచయిత అడ్రసు:
>
> — యల్. వి. యల్. యన్. శర్మ,
> డిపార్టుమెంట్ ఆఫ్ ఇండస్ట్రియల్ మేనేజిమెంటు, ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైన్సు, బెంగుళూరు—12.
>
> టేపు రికార్డరు సదుపాయము లేనివారు యీ క్రింది భాగం వదలి వేయవచ్చును.
>
> "ప్రమో:— అయినా యివన్నీ మావని మీకు బుజువేమిటి? ఏదో స్నేహితుడు కదా......నుంచి
> గోపీ:—నేనే రికార్డు చేశాను; వింటావా?" వరకు.




ఈ పేరుపెట్టిన వాళ్లని నిజంగా మెచ్చుకోవచ్చు ఆఫ్రికాలో కనబడే ఈ పక్షి తల మీద, మెడమీద సుమారు 20 వర్లని ఈకలు ఉంటాయి. పక్షికి ఉద్రేకం కలిగితే ఇవి పైకి లేస్తాయి. ఎంతో ఠీవిగా ఉండే సెక్రటరీ 'ఈక' కలాల్ని [గత శతాబ్దంలో అవి వాడుకలో ఉండేవి] తలపాగాలోకి చెక్కిన రూపం కనబడుతుంది. ఈ ఈకలు ఆఫ్రికాలో కొన్ని తెగలవాళ్లు తలపాగాల అలంకారానికి ఉపయోగిస్తారు.

ఈ పక్షి సుమారు నాలుగు అడుగుల ఎత్తు ఉంటుంది. కాళ్ళు పొడవుగా ఉండడం వల్ల కొంగలాగా కనబడుతుంది కొంగకి చేపలు మోజు అయితే దీనికి పాములంటే ఇష్టం—విషపాములైనాసరే పాము కనబడగానే దాని చుట్టూ తిరిగి వీలు కలగానే తన రెక్కలు, చాచి వూపుతూ ఉగ్రరూపందాల్చి, పాదాలతో బలంగా మోది, చంపి, ప్రీతిగా తింటుంది. తనకు ప్రమాదవశాత్తూ కాటుపడకుండా ప్రతిసారీ చాపకచక్యంతో వెనక్కి దూకుతుంది. పాము చచ్చిపోయినా తినేటప్పుడు ఎందుకైనా మంచిదని ముందు తలవేపు ప్రారంభిస్తుంది మింగడాన్ని.

శాస్త్రీయంగా దీన్ని సేజిట్టేరియను సర్పెంటేరియను అంటారు. సేజిట్టేరియను అంటే విలుకాడు అని అర్థం. ఈకల అంబుల్పొది పెట్టుకున్న విలుకాడిలాగా కనబడుతుంది సర్పెంటేరియను అంటే సర్పాహారి.

ఇది నిజానికి గ్రద్దల విభాగానికి చెందింది. కాని అంత ప్రజ్ఞతో ఎగరదు, ఎగరలేదు కూడా. కాని ఎగిరిందీ అంటే దాని వ్యవహారం చూడాల్సిందే. విమానంతో దీన్ని పోల్చవచ్చు. రెక్కలు విచ్చుకొని [రెక్కలు విచ్చుకుంటే ఏడడుగుల వెడల్పు ఉంటుంది] విమానంలాగా నేలమీద కొంతదూరం పరిగెత్తి గాలిలోకి పోతుంది. దిగేప్పుడు కూడా అలాగే విమానం దిగినట్టుగానే ముందు కాళ్ళు ఆన్చి కొంత దూరం పరిగెత్తి మరీ ఆగుతుంది.

పాములేగాక, పురుగులు, చిన్న పక్షులు, ఎలకలు కూడా దీనికి ఆహారమే. కంటి చుట్టూ ఈక లుండవు; చుట్టూ నారింజ వర్ణం ఉంటుంది. చూపు చాలా క్రూరంగా మోసంగా కనబడుతుంది.

గ్రుడ్లు, 2, 3 పెడుతుంది. మగ ఆడ రెండూ పొదుగుతాయి. దీని గూడు దగ్గరే ఒక జాతి పిచ్చుక గూడు కట్టుకొంటుంది. ఆ రెండిటికీ ఉండే సహకారం ఏమోకాని, ఈ చిన్న పక్షులకి హాని చెయ్యదు సరికదా రక్షిస్తూ ఉంటుంది సెక్రటరీ పక్షి.

కోల్ మైన్సు, మాంగనీస్ మైన్సు, గోల్డు మైన్సు...ఓ...సారీ...గోల్డు మైన్సిప్పుడు గవర్నమెంటు క్రిందనున్నయ్ కదూ? అందుకని గోల్డుమైన్సు నాకు లేవులే. కోల్ మైన్సు, మాంగనీసుమైన్సు వున్నయ్. వీటికిలదు బోల్డుఫాక్టరీలుకూడా వున్నయ్. ఈ వూళ్ళో ఒక ఫాక్టరీ పెట్టాలనొచ్చాను. కొన్నాళ్ళీ వూళ్ళోనండి యీ లొకేషన్ బాగావుందో లేదో చూసి మళ్ళీ అర్జెంటుగా బొంబాయి వెళ్ళిపోవాలి... శోభనాద్రికి మా ప్రోడక్ట్సుకి రీజియనల్ ఏజన్సీ కావాల్ట. కానీ ప్రమోదరావు నా వెంటెందుకు తిరుగుతున్నాడో నాకర్థం కావటంలేదు.

రవి : శేఖర్! నువ్వి క్రేజ్‌లోపడి ఏదో ప్రమాదంలో చిక్కుకుంటావు. ప్రమోదరావు చాలా దుర్మార్గుడు. అతడ్తో చాలా ప్రమాదం.

శేఖర్ : దుర్మార్గానికొస్తే నేనేం తీసిపోన్లే...ఇంతవరకూ అలాంటిదేం ఎదురవ్వలేదు. ఎదురైతే ఆ థ్రిల్‌కూడా చూస్తాను. అయినా అంతవరకూ రాకుండానే మకాం ఎత్తేస్తాను. నువ్వేం భయపడకు.

( గోపీనాథ్ ప్రవేశం )

శేఖర్: వో...ప్రమోదరావుకొడుకొస్తున్నాడు [అని ఏం తెలియనట్లు టేబిల్ మీద పుస్తకం తిరిగేస్తూ వుంటాడు].

గోపీ : రవిగారూ! మీ రిక్కడున్నారా? ఇందాకట్నుంచీ మీ కోసం మీ ఆఫీసంతా వెతుకుతున్నాను. వో...శేఖర్ బాబుగారా!! మీరూ యిక్కడున్నారా?! రవిగారూ! ఈయన మీకు తెల్సా? శేఖర్‌బాబుగారని పెద్ద లక్షాధికారి!!

శేఖర్ : నో, నో... లక్షాధికారిని కాదు; కోటీశ్వరుణ్ణి.

గోపీ : తప్పయిపోయింది. మీరు కోటీశ్వరుల్సార్. రవిగారూ! వీరు మన పిక్చర్సుకి ప్రొడ్యూసరు. మా నాన్న నాతో చెప్పాడ్సార్. వీరింటికెవరో చదువుకునే కుర్రడొళ్ళి చదువుకునేందుకు సహాయం చెయ్యండీ అంటే జేబులోంచి రెండు లక్షలిచ్చార్ట రవిగారూ! కోటీశ్వరుడు గదండీ మరి! అందుకని జేబులో లక్షలుంటయ్ మరి. పాపం లక్షాధికారి జేబులో వేలేవుంటయ్ గదా మరి......

నేనింవాక వెళ్ళి

'సార్! సినిమా తియ్యాలనుకుంటున్నాను. ధర్మం చెయ్యండీ' అంటే

'ఫో...యిరవై లక్షలిస్తాను...పిక్చర్తీసి పారెయ్' అన్నారండి.

రవి : ఏఁవిటి? సినిమా తీసేముందే 'ధర్మం' చెయ్యండీ అంటూ బయల్దేరావా? చాలామంది సినిమా తీశాక బయల్దేర్తారే!

గోపీ : మనదంతా నావెల్టీ రవిగారూ! మనం పిక్చర్తీశాకా, తియ్యకముందుకూడా 'ధర్మం' అంటూ బయల్దేర్దాం. మనదంతా నావెల్టీలెండి...వీరు డబ్బిస్తే నన్నారని స్క్రిప్టుపని చకచకా పూర్తిచేసేస్తున్నాను.

శేఖర్ : ఇంతకూ కదేఁవిటి? నేను ప్రొడ్యూసర్ని గదా? ప్రొడ్యూసరికి కథ చూపించొద్దూ?

గోపీ : రవిగారురాసిన నవలలెదండీ— 'చీడపురుగులు'— అదండి —ఇంతవరకూ మా నాన్న ప్రొడ్యూసర్‌గా వుంటాడేమోనని ఈకథ మానాన్నకి వినిపించాన్సార్. అన్నట్టు మానాన్న దగ్గరా బోల్డు డబ్బుందండి. కానీ మీ దగ్గరున్నంత కాదండి. వో పెద్ద పెట్టెనిండా కట్టలకి కట్టలు డబ్బుందండి. అయినా సినిమా తీస్తానికి మాత్రం డబ్బివ్వడండి, అదేం మనిషో. అయినా మనం ప్రయత్నించాలి గదండీ. సినిమా అంటే మాటలా సార్. బోల్డుమందిని వొప్పించాలి గదా?!

రవి : గోపీ! నాక్కాసిని మంచినీళ్ళు కావాలోయ్.

గోపీ : అబ్బబ్బ ... ప్రొడ్యూసరుగార్తో మాట్లాడేటప్పుడు అడ్డం రాకండి. మీరేమన్నా హీరోనా యేమన్నానా, వట్టి కవిగారివేకదా! మంచినీళ్ళు యింట్లో వుంటయ్ పోయితెచ్చుకోండి (రవి లోపలికెడతాడు) ఏదో కవిగదా అని లోకువ చేసేశాంగానీ యిదే హీరోఅయితే పరిగెత్తుకెళ్ళి తెచ్చేవాళ్ళం కదూ... అన్నట్టు...ఆఁ... రవిగారికథ మానాన్నకు చూపించానండి. కానీ మానాన్న వొప్పుకోలేదండి

శేఖర్ : ఏం? ఎందు కొప్పుకోలేదు ?

రవి : ఆయనకి పేరు నచ్చలేదుటండి! మొదట 'చీడపురుగులు' అని పెడ్తే కాదన్నాడండి. పోనీ 'విషకుంభాలు' అని పెడ్తానన్నానండి. ఆయనకదీ నచ్చలేదండి. ఏపేరు పెట్టినా తనని గురించే అనుకుంటాడండి.

శేఖర్ : పోనీ 'తేలుకుట్టిన దొంగలు' అని పెట్టండి బాగుంటుంది.

గోపీ : బావుందండి...కానీ కథ తెలియకుండా పేరెట్లా సెలెక్టు చేశారండీ!!

శేఖర్ : (నవ్వుతాడు)

గోపీ : వో ... అవున్లెండి ... పేరు పెడ్తానికి కథ తెలియాల్టి లెండి... ఏవిటో...సినిమా ఫీల్టులోకి దిగబోతున్నా యింకా యిలాంటి పిచ్చిప్రశ్న లేస్తూ వుంటాను క్షమించండి...మనిషికి పుట్టంగానే వాడిస్వభావం తెల్సుకోకుండానే పేరు పెట్టేయ్యటం లేదూ! ఈసినిమా పేర్లూ అంతేలెండి ... ఇంతకూ తేలు కుట్టిన దొంగలులో తేలుపోర్ష నెవరేస్తారండి?

శేఖర్ : మనుష్యులు వెయ్యరు ... తేలే వేస్తుంది.

గోపీ : వోహో...ఇదిగూడా ఒక నావెల్టీ అన్నమాట, భలే బాగుందిసార్ ... కానీ నిజం తేలువేస్తే డైరెక్టు చెయ్యటం కష్టం అండి. యింకెవడో డైరెక్టు చేస్తే ఫరవాలేదు. ఆ పిక్చరు నేనే డైరెక్టుచెయ్యాలే...ఎట్లా? (ఆలోచించి) పోన్లెండి. నిజంతేలుని కాకుండా వో పెద్ద అట్టతేలుని పెడదాం. చాలా పెద్ద తేలుని పెడదాం సార్. మన జానపద సినిమాలు తీసే వో పెద్ద డైరెక్టరున్నాడ్చూశారూ ...ఆయన్లాగా చేద్దాం సార్...ఆయన నా గురువండీ ... ఫర్వాలేదు లెండి? నేను మేనేజ్ చేస్తాగా...

శేఖర్ : ఇంతకూ హీరో ఎవరు పిక్చర్లో?

గోపీ: దాన్ని గురించే చాలా రోజులాలోచించాన్సార్... మన పద్మశ్రీలకి అయిదేళ్ళదాకా తీరిక లేదట. వాళ్ళు లేకపోతే పిక్చరేం పోతుంది సార్...పోతే పోయిందని ఆ హీరో రోల్ కూడా నేనే వేసేస్తున్నాన్సార్...

శేఖర్: అయితే డైరెక్టరు, హీరో... అన్నీ నువ్వే నన్నమాట! చివరికి ప్రేక్ష

# విషవలయం

[illegible]

గోపీ: మీరు భలేవారండీ...ప్రేక్షకుణ్ణి నేనేవిటి సార్! మీరు భలే హ్యూమరస్‌గా మాట్లాడ్తారే. అయినా మనది ప్రయోజనాత్మక చిత్రం సార్...ప్రేక్షకుడుండడు.

శేఖర్: సరే...నేను కాస్త రెస్టు తీసుకోవాలి...వస్తాను (అని మెట్ల వైపు పోతూ వుండగా)

గోపీ: సార్! ఒక్కక్షణం కూర్చోండి ...నా స్క్రిన్‌ప్లే, డయలాగ్సు చూడండి [అంటూ పట్టుకొచ్చి కూర్చోబెడతాడు].

శేఖర్: అంతా తయారయ్యిందా?

గోపీ: లేదండి. ఒక్క క్లయిమాక్సు సీనుకి మాత్రం అయ్యింది. పిక్చరు మొదలెడితే మిగతావి అవుతాయ్ లెండి.

శేఖర్: క్లయిమాక్సు సీను ఒక్కటే కదా?! బ్రతికించావ్.

గోపీ: చూడండి సార్. హీరో- అంటే నేను—పశ్చాత్తాపంతో హీరోయిన్ దగ్గర కొస్తాడు. చివరి సీను కదండి. అందుకని పశ్చాత్తాప పడ్తాడు. అంతకు ముందు కాదు కింద పడ్తాళ్లండి. హీరోయిన్ 'శాంత' యిది (అని టేబిల్‌వంక చూపించి) ...హీరోయిన్ దగ్గరకొచ్చి గుండె పిక్కుంటూ—అంటె—గుండె పట్టుకుని ......'శాంతా! నేను నీచుణ్ణి, ఒకప్పుడు కోపిష్టివాణ్ణి, అప్పుడు నిన్ను బాధ పెట్టాను. ఇప్పుడు పాపిష్టివాణ్ణి, నీ పాదాలు పట్టుకుంటున్నాను', 'కోపిష్టివాణ్ణి—పాపిష్టివాణ్ణి' రైమ్ బాగుందా సార్!

'క్షమించమని అడిగే అర్హత నాకు లేదు. అందుకని అడగను. అయినా క్షమించు శాంతా! శాంతా! నన్ను క్షమించు' అంటాడు. ఇప్పుడు హీరోయిన్ కాళ్ళు వెనక్కు లాక్కుని 'హుం...మిమ్మల్ని నేను క్షమించడమా?' అంటుంది. ఈ మాటలని చెప్పేపోగుతుంది. తర్వాత ... తర్వాత డయలాగు చెప్పన్సార్.

శేఖర్: ఆదేవిటోయ్? సిగ్గ!!

గోపీ: సిగ్గు కాదండి... చెపుతాను... కాని వెంటనే చెప్పను. ఇక్కడ సస్పెన్సు... 'హుం...మిమ్మల్ని నేను క్షమించడమా?' అంటుంది గదండి! వెంటనే హాల్లోవున్న ఆడవాళ్ళు 'అవునమ్మా, ఎందుకు క్షమిస్తుంది? పాపిష్టి వెధవ ఎన్ని కష్టాలు పెట్టాడమ్మా పాపం! అమ్మా శాంతమ్మా! వాణ్ణి క్షమించకమ్మా'

అని అంటూ వుంటారు. వాళ్ళనలా అనుకోనిచ్చి మన శాంత యేం చేస్తుందో తెల్సాండి? 'హుం ... మిమ్మల్ని నేను క్షమించడమా' అని 'కాదు, మీరే నన్ను క్షమించాలి' అంటుంది. ఎటా వుందండి సీను...

శేఖర్: (ఆవలిస్తూ) బ్రహ్మాండంగా వుంది. మిగతావి కూడా పూర్తి చెయ్. సెట్స్‌మీది కెళ్ళిపోదాం...

గోపీ: మనం యిక సెట్సుమీది కెళ్ళిపోదాం రవిగారూ!... అబ్బబ్బ...ఈ రవిగారేడి? మహానుభావుడు ... మంచినీళ్లంటూ లోపలే వున్నట్టున్నాడు... (అని బయటకు చూసి కంగారుగా) అయ్య బాబోయ్! మా నాన్నొచ్చేస్తున్నాడు. రవిగార్ని యింటికి రప్పించి కథ్రలాయించటం ఆయనకు నచ్చదు. ఈయనేమో లోపలే కూర్చున్నాడు. అట్నుంచటు దొడ్డిదారిన పంపించేస్తాను (అని లోపలికి పరుగెత్తుతాడు)

(ప్రమోదరావు, శోభనాద్రి, భజగోవిందం ప్రవేశం)

ప్రమో: (వస్తూనే) శేఖర్‌బాబుగారూ! కొంచెం రెస్టు తీసుకున్నారనుకుంటాను.

శేఖర్: అబ్బే ... లేదండి. అయినా విశ్రాంతి అంటూ గంటలకి గంటలు నిద్రపోవటం నా కలవాట్లేదు. రాత్రిళ్ళ కూడా నాలుగ్గంటలకంటే యెక్కువ నిద్రపోను. ఐ కాంట్ ఎఫోర్డ్, ఇలా రోజుకి యిరవై గంటలు పనిచేసినా నా బిజినెస్ వ్యవహారాలు తేలవ్. ఏంవిటో బిజీ లైఫ్...

శోభ: అంతేనండి ... అట్లానే వుండాలి ... నేను కూడా ఎన్నికలప్పుడు చాలా బిజీమనిషి నన్నమాటే. ఆ రెండు మూణ్ణెల్లూ మీటింగులుమీద మీటింగులు తెల్లవార్లూ పెట్టేస్తాను. ఎన్నికలయ్యి మళ్ళీ ఎన్నిక లొచ్చేదాకా నిద్దరోతాను... ఆ దేవుడూ...ఆడు ... కుంబకర్ణుడిమాదిరన్నమాట (అంటూ నవ్వుతాడు)

ప్రమో: ఆఁ ... మీనుంచి మాకొక సహాయం కావాలని క్లబ్బులో చెప్పాను. ఇప్పుడు వివరంగా చెపుతాను. భజగోవిందం! వీధి తలుపేసిరా (అని తను లోపలికెళ్ళి ఒక సూట్‌కేస్ తెస్తాడు... భజగోవిందం వీధి తలుపువేసి వస్తాడు)

మా దగ్గర కొన్ని లక్షల దొంగనోట్లున్నయ్. వాట్ని మార్చటానికి మీ సహాయం కావాలి.

శేఖర్: (కుర్చీలోంచి కంగారుగా లేచి కాస్సాపాలోచించి) ఈ దొంగనోట్లని మార్చేపని నేను చెయ్యగలననీ, చేస్తాననీ మీ రెందుకనుకున్నారో నా కర్థం కావటం లేదు. దిసీజ్ ఏ క్రయిమ్ ... సీరియస్ క్రయిమ్.

ప్రమో: అహఁ...మీరట్లా మాట్లాడొద్దు. కాదు. మీ స్నేహితులం మేం. మాకోసం ఈ వుపకారం చేసిపెట్టాలి. పైగా యివి మేం ముద్రించిన నోట్లు కావు. మాకీ పెట్టెరైల్లో దొరికింది. ఈ నోట్ల కట్టలని చూడగానే కాస్త ఆశపుట్టింది. ఏమీ ప్రమాదం లేకుండా మార్చగలిగితే మనకెంతో డబ్బువస్తుంది. ఆ ఆశవల్లే యింతకాలం వీట్ని దగ్గరుంచుకున్నాం...

శోభ: అయినా నాకు తెలియక అడుగుతా...ఏంటేంటో కబుర్లు చెప్పేసినావ్ గాని బూ కొత్త పని చెయ్యలేం, మా బజగోవిందమే కొన్ని నోట్లు మార్చాడే ... అదేదో ముతకసామెత చెప్పినట్టు ఆడే నయం లాగుందే నీకంటే. ఏం బజగోవిందం?!

భజ: అ!...అవునండి...వో వంద ఫదిరూపాయల కాగితాల్ని నేనే మెల్లగా మార్చానండి. కానీ వో తడవ వో కొట్టుకెడితే వాడీనోటు తీసుకుని తిరగేసీ, బోర్లేసి శల్య పరీక్ష చేశాడండి. దాంతో నాకు హడాకు పుట్టుకొచ్చిందండి. ఆ కొట్టువాడో వెధవ గనక సరిపోయిందిగానీ అదే ఏ బ్యాంకువాడో అయితే నామెడకి వురివేసేవాళ్ళు గదండీ. కానీ ప్రమోదరావుగారు నాకు తండ్రిలాంటి వారు కాబట్టి వారెప్పినట్టు వో వందనోట్లు మార్చాను...తర్వాత భయమేసిందండి.

ప్రమో: నాకూ కూడా యిలా చిల్లరగా మార్పించటం మంచిది కాదనిపించిందండి అదీగాక వాడెవడోగాని ఏడెనిమిదిలక్షల్దాకా అచ్చుగుద్దాడండీ ... ఇప్పుడనుకునేదేవిటంటే దేశం నాలుగుమూలలకీ వీట్ని చేరేసి సరిగ్గా ఒకేరోజున వీట్ని మార్కెట్టులోకి తోసెయ్యాలి, ఎవడన్నా అనుమానించేలోగానే మన డబ్బు మన చేతికొస్తుంది. ఏ వంటారు? దేశంలో నాలుగుమూలలకీ చేరవేసే బాధ్యత నేనూ, శోభనాద్రీ తీసుకుంటాం. మీతా

ప్రదేశాల్లో వ్యాపారాలున్నయ్ కాబట్టి మీరు వాట్నక్కడ మార్చాలి.

శోభ: అసలీ మార్చటం కూడా నేనే చేసేయగల్ను కానీ ప్రమోదరావుకే ధైర్యం చిక్కటంలేదు. మీరేమో బెట్టు చేస్తున్నారు.

శేఖర్: అబ్బే...బెట్టు చెయ్యటం కాదు నేను చెయ్యదల్చుకుంటే చేసి పారెయ్యగలను! కానీ...

ప్రమో: ప్రతిఫలం విషయం ఆలోచిస్తున్నారా?

భజ: (శేఖర్‌బాబు దగ్గరకెళ్ళి) ఈ విషయంలో ప్రమోద రావుగార్నేం అనుమానించకండి. ఎందుకూ నేనో సంగతి చెపుతాను వినండి...నేనో అయిదొందలు లంచంపట్టి వారికిస్తే! భజగోవిందం! పిల్లలు గలవాడివి. ఈ రెండొందలూ వుంచుకో అని నాకిస్తారు. అహా... మీకు పిల్లలున్నారో లేదో తెలియదనుకోండి, అయినా మీ వాటా మీ కిస్తారు.

శేఖర్: హహ్హహ్హా నాకు ప్రతిఫలం యివ్వటం గూర్చి ఆలోచిస్తున్నారా? (నవ్వుతూ) మీరిందులో వున్న యెనిమిది లక్షలు నాకిచ్చినా నాపాకెట్ ఎక్స్‌పెన్సెస్‌కి సరిపోవు. అందుకే మీరు నాకేం యివ్వ నక్కర్లేదు, ఫ్రెండ్‌గా మీకీ సహాయం చేస్తాను. నాకీ దేశంలో వున్న వ్యాపార స్థావరాలన్నీ మీరీ డబ్బుని మార్చేందుకు వుపయోగించుకోవచ్చు నేను మాత్రం పర్సనల్‌గా ఏమీ చెయ్యను. ఎందుకంటే యిలాంటివి చెయ్యటం నేరం. అదీగాక ఆఫ్టరాల్ ఎనిమిది లక్షలకి నేను కూడా దిగటం మెందుకు? ...ఏదీ...ముందీ నోట్లని చూడనివ్వండి [అని పెట్టె తెరచి ఒక నోట్లకట్ట తీసి] బాగానే వున్నయ్...అన్నీ పదిరూపాయల నోట్లన్నమాట.

ప్రమో: అవునండి.

శేఖర్: (కాస్సేపు చూసి) కానీ యీ నోట్లల్లో ఎక్కడో ఏదో వెలితిగా వుంది. చూద్దాం వుండండి. (అని తన జేబులోంచొక పది రూపాయల నోటుతీసి)... యిదిగో...అసల్దానికి, వీటికీ యిక్కడ... యిక్కడ భేదంవుంది. లాభం లేదు. వీట్ని కొంత మారిస్తేగానీ మనం మార్చలేం. వాట్ని సరిదిద్దటం ఈ నోట్లుకొట్టిన వాళ్ళే చెయ్యగలరు వాళ్ళదగ్గిరే ఆసామాగ్రి వుంటుంది. సారీ! యివి మీకేం వుపయోగం లేదు. ప్రాణాలమీదికి రాకముందే వీట్నన్నిటినీ కాల్చి పారెయ్యండి. (అని పెట్టె మూసివేస్తాడు. ప్రమోదరావు, శోభనాద్రీ, భజగోవిందం ఒకళ్ళ మొహాలు ఒకళ్ళు చూసుకుంటారు).

శోభ: అయితే... ముద్దర కొట్టే సామాన్లుంటే తప్ప వీట్ని మార్చలేరా?

శేఖర్: అవును. ఆ సామాగ్రివుంటే నేనే చేసిపారెయ్యగల్ను...మనం యెవరి దగ్గరకో వెళ్ళక్కర్లేదు.

శోభ: ఇందాకా వచ్చాక యింకా రహస్యాలేంటి ప్రమోదం, చెప్పెయ్.

భజ: అవునండీ చెప్పెయ్యండి.

ప్రమో: శేఖర్ బాబుగారూ! క్షమించండి. మీతో అబద్ధం చెప్పాను. కానీ యిన్ని లక్షలు వృధాగా పారేసుకోలేం చూడండి...యివి ముద్రించింది మేమే... నేనూ, శోభనాద్రీ.

భజ: నేనూ కొంచెం సహాయం చేశానండీ...వో లక్ష రూపాయల సహాయం.

శోభ: వోయ్ బజగోవిందం! నీది లచ్చ రూపాయల సహాయమా? నీది లచ్చ రూపాయల సహాయమయితే నాది నాలుగు లచ్చల సహాయం...ఆఁ.

ప్రమో: మీరూరుకోండోయ్...యివన్నీ మార్చాక అందరికీ అనుకున్నట్టుగానే యిస్తాను. శేఖర్‌బాబుగారూ! మాదగ్గిర ఆ సామాగ్రి అంతా వుంది. చేసే మార్పులు చేసెయ్యండి.

శేఖర్: వో. కె. రేపు మొదలెడ్దాం. నేనలా బయటకెళ్ళొస్తాను. అర్జంటుగా మా ఢిల్లీ బ్రాంచికో టెలిగ్రాం యివ్వాలి! అని తన సూట్‌కేసు తీసుకుంటాడు.)

ప్రమో: క్షమించండి శేఖర్‌గారూ! మీరీ మార్పులు చేసేటంతవరకూ యీ యిల్లు దాటి బయటకు వెళ్ళకూడదు.

శేఖర్: నిర్బంధమా?

ప్రమో: అలా అనకండి. మా జాగ్రత్తల్లో మేం వుండాలి కదా. ఇంతవరకూ ఈ రహస్యం మా ముగ్గురికీ తప్ప యింకెవ్వరికి తెలియదు. ఇప్పుడు మీకు తెలిసింది. మీరు రేపు ఈ నోట్లని సరిచేసేటప్పుడు సామాగ్రితోసహా మీ ఫోటో తీసుకుంటాం. అంతవరకూ మీకీ నిర్బంధం తప్పదు. మీరు నన్ను క్షమించాలి.

శేఖర్: ఒకవేళ యిప్పుడే నేను పోలీసులకి ఫోన్ చేస్తే...

ప్రమో: (నవ్వి శోభనాద్రి వంక చూస్తాడు)

శోభ: పేణాలమీద ఆశవుంటే ఆపని చెయ్యవ్...

శేఖర్: ఇదన్నమాట మీ పన్నాగం (నవ్వి) ఫరవాలేదు. ఆ మాత్రం జాగ్రత్తలో వున్నారు. ఇలాంటి పన్లకి జాగ్రత్త చాలా అవసరం. మీరు మీ జాగ్రత్తలో వున్నారో లేదో తెలుసుకునేందుకే ఈ ప్రశ్నలు వేశాను. యు ఆర్ పర్‌ఫెక్ట్లి కేర్‌ఫుల్.



# విషవలయం

ప్రమో! ఆఁ...మీరొకసారి ఆ సామాగ్రి చూడండి. తెస్తానుండండి... భజగోవిందం! ఆ తలుపుదగ్గరేవుండు (అని వీధి తలుపు వైపు చూపించి లోపలి కెళ్తాడు)

[లోపల్నుంచి 'ప్రమోదరావ్! పారిపోటానికి ప్రయత్నించకు, నడు బయటకి' అన్న కేకలు వినిపిస్తాయ్]

శేఖర్ : [కంగారుగా] ఏమిటది?

శోభ : ఏంలేదు శేఖర్‌బాబూ! హాయ్ భజగోవిందరి! ఏమిటా హాణుకుడు? ఆ అర్చేది గోపీ. ప్రమోదం కొడుకు. సినిమాలో డిటెక్టివ్‌లాగా వాళ్ల నాన్నని అప్పుడప్పుడూ బెదరగొడుతూ వుంటాడు అంతే ... హాయ్ గోపీ! ఈ నోట్లన్నీ మార్చేక సినిమా తీద్దుగాన్లే బాబూ... మీ నాన్నివ్వకపోయినా నే నిస్తాలే డబ్బు. (నవ్వుతాడు)

శేఖర్ : 'రుమాలోతో మొహం తుడుచుకుంటూ' అమ్మయ్య అంతే కదా!

(లోపల్నుంచి ప్రమోదరావు, వెనక రివాల్వరు పట్టుకుని రవి, గోపీనాథ్ ప్రవేశం)

రవి : శోభ నాద్రి భజగోవిందం... యు ఆర్ అండర్ అరెస్టు...

శోభ : హాయ్ గుమాస్తా రవివి కాదూ! ఏంటి మాట్లాడుతున్నావ్? లాగి లెంపకాయ కొడతాను, ఏమిటి

రవి : షటప్! ఐయామ్ రవికుమార్ ఫ్రం సి. ఐ. డి.

ప్రమో : అయినా యివన్నీ మావని మీకు ఋజువేమిటి? ఏదో స్నేహితుడు కదా అని ఈ శేఖర్ని యింటికి పిలిస్తే యివన్నీ అతనే తెచ్చాడు. మాకేం తెలియదు.

గోపీ : నాన్నా! ఆ పప్పులేం వుడకవ్? ఇదిగో మన టేపురికార్డర్ మీదే మీరన్నవన్నీ నేనే రికార్డుచేసాను వింటావా అని రికార్డర్ ఆన్ చేస్తాడు. 'శేఖర్ బాబుగారూ క్షమించండి! మీతో అబద్ధం చెప్పాను. కానీ యిన్నిలక్షలు వృధాగా పారేసుకోలేం చూడండి...యివి ముద్రించింది మేమే—నేనూ, శోభనాద్రీ' అన్న ప్రమోదరావు మాటలు వినిపిస్తాయ్ రవి గోపీతో ఆపమన్నట్టు సంజ్ఞ చేస్తాడు. ప్రమోదరావు తల వంచుకుంటాడు]

రవి: రెండు నెలల క్రితం యీ వూళ్లో దొంగనోట్లు కనిపించినేయ్. ఈవూరొచ్చి ప్రమోదరావు ఆఫీసులో గుమాస్తాగా చేరి నా ఇన్వెస్టిగేషన్ ప్రారంభించాను. గోపీనాథ్ నేనో రచయిత ననుకున్నాడు. నాతో తిరుగుతూ అమాయకంగా 'మా యింట్లో బోల్డు నోట్ల కట్టలున్నయ్' అనేవాడు. అప్పట్నుంచే ప్రమోదరావ్ ఇంటిమీదొక కన్ను వుంచాను. నోట్ల కట్టలున్న యీ పెట్టె సంగతి యెప్పుడో తెలిసింది. కానీ సామాగ్రి యెక్కడుందో తెలియలేదు. ఈ వ్యవహారంలో భాగం వున్న మిగతావాళ్లెవరో కూడా తెలియలేదు. అందుకే యింతవరకూ ఏక్షన్ తీసుకునేందుకు వీలుపడ్లేదు. శేఖర్ యీ వూరు రావటంతో మీ వ్యాపారానికి చలనం, నా సమస్యకి పరిష్కారం లభించాయి. శేఖర్ యెవరో కోటీశ్వరుడను కుంటున్నారు కదూ?

శేఖర్: రవీ! నా గురించేం చెప్పకు. ప్లీజ్.

రవి: ఆగు శేఖర్! పేదరికాన్ని తెలియజెప్పుకోవటంలో సిగ్గు పడాల్సిందేమీలేదు. సిగ్గు పడాల్సింది యిలాంటి అవినీతిపరులు, సంఘద్రోహులు. ఈ శేఖర్ ఎవరో వినండి. ఇతడు రేపెలా గడుస్తుందా అని భయపడే మామూలు మనిషి. కానీ చాలామందికున్నట్టే మీలాంటి డబ్బున్నవాళ్లతో తిరగాలనే 'క్రేజ్' ఇతనికీ వుంది. ఆర్థికంగా నిచ్చెన పైమెట్టులో వున్న మీలాంటివ్యక్తులతో తిరుగుతూ తనూ స్టేటస్ పెంచుకోవాలను కున్నాడు. ఇలాంటి జబ్బు ఈ ప్రపంచంలో చాలా మంది కుంది. కానీ నిచ్చెన పైమెట్టు మీద వుండే చాలా మంది వ్యక్తుల నిజ స్వరూపాలందరకూ తెలియవ్! శేఖర్ యీ 'క్రేజ్' వల్లే మీరు సృష్టించిన విషవలయంలో చిక్కుకున్నాడు. కానీ మీలాంటి వాళ్లుచేసే దురాగతాలు చెయ్యలేదు, అందుకే యీ నోట్లు సరిచెయ్యటం విషయాన్ని రేపటికి వాయిదా వేశాడు. నేనిప్పుడు రాకపోతే శేఖర్ రేపే పాటికే వూరునుంచి మకాం యెత్తేసేవాడు. రేపట్లోగా మీనుంచి తప్పించుకుని పోలేకపోతే మీరు సృష్టించిన విషవలయంలో చిక్కుకుని డబ్బున్నవాళ్లతో తిరగాలనే తన 'క్రేజ్' కి ఆహుతి అయ్యేవాడు. శేఖర్‌లాంటి వ్యక్తులందరికీ అతని అనుభవం ఒకపాఠం నేర్పుతుంది.

శేఖర్! నిన్ను మొదట్లో గుర్తుపట్టాను; కానీ నీకు కూడా దీంట్లో భాగం వున్నదేమోనన్న అనుమానంతో నిన్ను గుర్తుపట్టనట్టు నటించి నిన్ను వెంటాడుదా మనుకున్నాను. ఏమయినా యీ కేసులో నీతో నాకు పనివుంది. నువ్వెక్కడికీ వెళ్లకు.

శేఖర్: రవీ! నేనో డబ్బులేని వాణ్ణని తెలియంగానే వీళ్లెలా చూస్తున్నారో చూడు ఆ చూపులు నేను భరించలేను రవీ! ఇంతవరకూ నా పాపాలు పట్టుకునేందుక్కూడా సిద్ధపడ్డ వెధవలు యిప్పుడు నేనంటే ఎంత నిర్లక్ష్యంగా చూస్తున్నారో చూడు. నే నా నిర్లక్ష్యాన్ని భరించలేను రవీ! నువ్వు నా బ్యాక్‌గ్రౌండ్ వీళ్లతో చెప్పకుండా నన్ను కూడా వీళ్లతో కలిపి ఈ క్రయిమ్‌లో భాగం వుందని కోటీశ్వరుడుగా జైలుకి పంపితే యెంతో సంతోషించేవాణ్ని. హుఁ...నా సంతోషం అంతా పాడ్చేశావ్ రవీ! ఆ సూట్‌కేస్‌లో నా అడ్రసుంది, వాతో అవసరం వున్నప్పుడు పిలు, వస్తాను. డబ్బులేనివాడిగా వీళ్లముందు యింకొక్కక్షణం కూడా నిలబడలేను (అని వీధివేపు భారంగా లొక్కుంటూ వెళ్లి ఒక్కక్షణం ఆగి, [illegible] బిగించుకుని వెనక్కి తిరిగి ప్రమోదరావు, శోభనాద్రుల దగ్గరకొచ్చి)

జెంటిల్‌మెన్! ఈ రెండు నిమిషాల్లో రవి చెప్పిందంతా మరచిపోండి. నేను కోటీశ్వరుణ్ణే! నమ్మండి!!నమ్మరూ?... రోజుకు యిరవైగంటలు పన్చేసినా నా బిజినెస్ వ్యవహారాలు తేలవ్. ఏమిటో బిజీలైఫ్...నేను కోటీశ్వరుణ్ణే నమ్మండి, నమ్మండి (పిచ్చిగా నవ్వుతూ వెళ్లి పోతాడు)

భజ: అయ్య బాబోయ్! యిందులో యింతమోసం వుందనుకోలేదు. ఏదో పై ఆఫీసరుగదా అని యింటికొచ్చాను. ఇంకా నయం... వస్తానండి (అని రవికుమార్‌కు దండంపెట్టి వెళ్లబోతూ వుంటాడు)

గోపీ: [అడ్డంవచ్చి] ఎక్కడికి పోతావ్? నువ్వు లక్షరూపాయల సహాయం చేశావ్ కదూ? వాటా తీసుకోవూ?'

రవి: నాకీ యిన్వెస్టిగేషన్లో చాలా హెల్పు చేశావ్ గోపీనాథ్...థాంక్సు (అని మిగతా ముగ్గురి వైపు తిరిగి) ఊఁ... పదండి.

(తెర)

న్యాయస్థానంలో అభియోగం విచారణ జరుగుతున్నప్పుడు వాది ప్రతివాది అన్యాయాన్ని వివరిస్తాడు. ప్రతివాది వాదిని విమర్శిస్తాడు. ఇలా జరుగుతూ ఉండడం సహజం! దీన్నిబట్టి వాది దృష్టిలో ప్రతివాది చెడ్డవాడు; ప్రతివాది దృష్టిలో వాది చెడ్డవాడు. వారి వాఙ్మూలాలు న్యాయాధికారిని తికమకలు పెట్టడంలో ఆశ్చర్యం లేదు.

ఇంతే కాదు. ఒకరి దృష్టిలో చెడ్డవాడయినవాడు మరొకరి దృష్టిలో చాలా మంచివాడవుతాడు.

ప్రతి జీవిలోనూ మంచీ, చెడ్డా రెండూ వుండవచ్చును మంచితనం పాలు ఎక్కువ ఉంటే మంచిపేరు సంపాదించవచ్చు. చెడుగు పాలు ఎక్కువ ఉంటే చెడ్డపేరు వస్తుంది.

రాక్షస రాజైన దశకంఠుడు చాలా చెడ్డవాడనే పేరు పొందాడు. అయినా, అతనిలో శివభక్తి, నియమపాలన, రాజ్యపాలన దక్షతా, జాత్యభిమానం మున్నగు ఉత్తమ గుణాలు లేకపోలేదు. కాని, అతడు చేసిన అకార్యంవల్ల అవి రాణించ లేకపోయాయి.

మానవుల్లోనే కాదు ఇతర ప్రాణుల్లో కూడా యీ స్వభావం స్పష్టంగా కానవస్తుంది.

క్రూరజంతువులలో పెద్ద పులి చాలా అపాయకరమైనది తనకు అపాయం కలుగుతుందని తోచినప్పుడే అది మనుష్యుడి మీద




బులుసు వేంకటరమణయ్య

పడుతుందంటారు.

అడవుల్లోని పల్లెలలో నివసించేవారు, వాళ్ళ గుడిసెలముందు రాత్రిళ్లు గుండెలమీద చెయ్యి వేసుకొని నిర్విచారంగానే నిద్రిస్తారు. క్రూరమృగాలు ఆవైపు వచ్చినా– తమదారిని పోతాయి. అంతే కాని వారిని ఏమీ చెయ్యవు.

తనమీద అడుగు పడినప్పుడో– తన్ను చంపడానికి చూస్తున్నారనే అనుమానం కలిగినప్పుడో – సర్పం కాటు వేస్తుంది. అట్టి అనుమానం గాని, భయం గాని లేనప్పుడు–అది తనదారిని పోతుంది. మనస్తత్వం గ్రహించేశక్తి మానవేతరాలయిన ప్రాణుల్లో బాగా ఉన్నదనే మనం గ్రహించవచ్చును.

తేలు మొదలైన విషజీవుల ప్రవృత్తి కూడా ఈ విధంగానే ఉంటుందని అనుకోవచ్చు.

ఒకప్పుడు చెడ్డగా వున్నవే మరొకప్పుడు మంచిని కలిగిస్తాయి. ప్రాణాలను తీసే పాము విషం (గరళం) పోవుటకు సిద్ధంగా వున్న ప్రాణాలను నిలుపుతుంది.

ఈ విధంగా మంచిది కూడా చెడుపు చెయ్యడం కద్దు. రుచిగా ఉన్నాయని మధురపదార్థాలను మితిమీరి తింటే ఆరోగ్యం చెడి రోగానికి దారితీస్తుంది.

ఈ విషయాన్ని గమనించే తత్త్వజ్ఞులు:–

"విషమప్యమృతం క్వచిద్భవే
దమృతం వా క్వచి
దీశ్వరేచ్ఛయా"

అని వెల్లడించారు.

మానవ ప్రకృతిలో మంచి చెడ్డలు సమ్మిళితాలయి ఉంటాయి. కేవలం చెడ్డ అని గాని, కేవలం మంచి అని గాని నిర్ణయించడం మిక్కిలి కష్టం!

ఏ వ్యక్తిలోనయినా చెడ్డగుణాలు కానవస్తే, వాటిని లెక్క చెయ్యకుండా మంచినే గ్రహించి, ఆ వ్యక్తితో మంచిగానే మాటలాడుతూ, మంచిగానే ఉండడం ఉత్తముల ధర్మం.

ఈ విధంగా ప్రవర్తిస్తే, ఎదుటివారి మనస్తత్వం మారడానికీ, వారిలోని చెడుగు మంచిగా మారడానికీ ఎంతయినా అవకాశం ఉన్నది.




# 2001 కిల్లిక్స్

## 7 లీటర్ల ప్రెషర్ కుకర్లు

6 సంవత్సరాల గ్యారంటీకల ప్రజాదరణ పొందిన కుకర్

3 సెపరేటర్లు, ఇతర ఉపకరణాలు, మరియు 70 పేజీల కిల్లిక్స్ ప్రెషర్ కుకరీ పుస్తకంతో సహా.
ముందు వచ్చిన 2001 సరైన ఎంట్రీలకు.

త్వరపడండి!
ముగింపు తేది:
30 వ జూన్ 1970

1 వ బహుమతి: కెల్వినేటర్ రిఫ్రిజిరేటరు లేక, రు. 3,000 రొక్కము!
రెండు 2 వ బహుమతులు: GEC రేడియోగ్రామ్ లేక, రు 2,000 రొక్కము!
మూడు 3 వ బహుమతులు: GEC ఓంకార్ 6 వాల్వుల.
4 వాల్వుల ఎ.సి. రేడియో. లేక రు. 600 రొక్కము!

# హిమాలయా బుకే టాల్కం 'ఏ పువ్వేది' పోటీలో చేరండి!

A. B. C. D. E అను గుర్తుంచబడిన ఈ 5 పువ్వుల రేఖా చిత్రాలను పరికించండి. ఏది ఏ పువ్వో మీరు ఊహించగలరా? ఈ క్రింద, 12 పువ్వుల పేర్లు ఇవ్వబడినవి. ప్రతి దానికీ ఒక అంకె ఇవ్వబడింది. ప్రతి పువ్వు యొక్క సరైన పేరు ఈ పట్టికలో ఉంది. సరియైన పేరు ఎంచుకోండి. దాని అంకెను, ఈ ప్రవేశ పత్రములో ఇవ్వబడిన జాగాలో, ఆ పువ్వుకు సంబంధించిన అక్షరము ప్రక్కన వ్రాయండి. (ఈ ప్రవేశ పత్రము మీద ఎంట్రీలు పంపవచ్చును. నిబంధనలు చదవండి)

ఉదాహరణ: పువ్వు A గసగసాల పువ్వు అనుకుంటే. ప్రవేశ పత్రములో A కి ప్రక్కన 1 వెయ్యండి. ఇట్లాగే మిగతావి కూడా. (పువ్వు A నిజంగా గసగసాల పువ్వు కాక పోవచ్చు. ఇది ఉదాహరణ మాత్రమే)







1. గసగసా 2. గన్నేరు 3. కలువ 4. చంద్రకాంత 5. రేరాణి 6. గులాబి 7. తామర 8. సంపెంగ 9. మల్లె
10. బంతి 11. గుండు మల్లె 12. వోదొగ్గ

| | 1వ ఎంట్రీ | 2వ ఎంట్రీ | 3వ ఎంట్రీ | 4వ ఎంట్రీ |
|---|---|---|---|---|
| A | | | | |
| B | | | | |
| C | | | | |
| D | | | | |
| E | | | | |

పేరు ______________________

చిరునామా ______________________

ఊరు ______________ రాష్ట్రము ______________

మీరు పౌడరు కొన్న దుకాణం పేరు ______________

హిమాలయా బొకే టాల్కం 5 పుష్ప పరిమళాలలో లభిస్తుంది: వసంతము, చందనము, గులాబి, మల్లె, కార్నేషను మీకు ఏది ఇష్టం? అది మీకు ఎందువల్ల ఇష్టమో, 20 మాటలకు మించకుండా ఒక వాక్యం వ్రాయండి. 'ఎందువల్లననగా' అని గాని అదే అర్థము ఇచ్చు ఇతర మాటలు గాని వాడవద్దు. మీ వాక్యము యొక్క మనోజ్ఞత, నవ్యత, సందర్భ శుద్ధి ననుసరించి, దాని విశిష్టత నిర్ణయించబడుతుంది. కావున, బాగా ఆలోచించండి

______________________

______________________

______________________

______________________

______________________

______________________

______________________

______________________

నిబంధనలు: 1 మీ ఇష్టం వచ్చినన్ని ఎంట్రీలు పంపండి. కాని, ప్రతి ఎంట్రీతో పాటు, ఒక హిమాలయా బొకే టాల్కం (లార్జిటిన్) కొనగా వచ్చిన నగదు రశీదు పంపటం మరిచిపోకండి ఒకే నగదు రశీదు మీద, ఒకటికన్న ఎక్కువ టిన్నులు కొంటే, ఎన్ని టిన్నులు కొన్నారో అన్ని ఎంట్రీలు పంప వచ్చును. ఈ ప్రవేశ పత్రం మీదనే 4 ఎంట్రీలు పంప వచ్చును. 2 ప్రవేశ పత్రములో ఇవ్వబడిన జాగాలో, మీ పేరు, పూర్తి చిరునామా విడివిడి అక్షరములలో వ్రాయండి. 3 మీ ఎంట్రీ లన్ని హిమాలయా బొకే టాల్కం పిక్-ది-ఫ్లవర్ కాంటెస్ట్, పోస్ట్ బాక్స్ నం. 11078, బొంబే-20 కి, 1వ జూలై 1970 కి పూర్వమే చేరునట్లుగా, పోస్టుద్వారా పంపండి 4 రిజిస్టరు పోస్టు ద్వారా పంపిన ఎంట్రీలు తీసుకోబడవు 5 వ్యక్తుల ద్వారా పంపిన ఎంట్రీలు తీసుకోబడవు 6. తప్పిపోయిన, ఆలస్యముగా చేరిన, పొరపాటైపోయిన ఎంట్రీలకు మేము బాధ్యులము కాము 7 అయిదు పువ్వులూ సరిగా గుర్తించబడిన ఎంట్రీలలోని నినాదముల విశిష్టత, మొదటి, రెండవ, మూడవ బహుమతుల నిచ్చుటకు, పరిశీలించబడును ఒక ప్రత్యేక న్యాయ నిర్ణేతల కూటమి ఎంట్రీలను పరిశీలిస్తుంది వారి నిర్ణయము న్యాయమైనది, మరియు బద్ధమైనది 8 బహుమతులు పొందిన నినాదములతో సహా, దాఖలు చేయబడిన నినాదము లన్నియు హిందుస్థాన్ లీవర్ లిమిటెడ్ వారి హక్కు భుక్తము వాటిని ప్రకటనలలో ఉపయోగించు కొనుటకు వారికి సర్వ హక్కులు కలవు 9 అయిదు పువ్వులూ సరిగా గుర్తించబడిన ఎంట్రీలలో, ముందుగా చేరిన 2001 ఎంట్రీలకు, 2001 కిల్లిక్స్ 7 లిటర్ల ప్రెషర్ కుకర్లు బహుమతిగా ఇవ్వబడును ఒకే కుటుంబము నుండి ఎన్ని ఎంట్రీలు పంపినను, ఒక్కొక్క కుటుంబమునకు ఒక్కొక్క బహుమతియే ఇవ్వబడును కుటుంబమనగా ఎవరెవరో నిర్ణయించు సంపూర్ణాధికారము హిందుస్థాన్ లీవర్ లిమిటెడ్ వారికి మాత్రమే కలదు 10 ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరములు జరుపబడవు 11 బహుమతులు పంచి ఇవ్వబడవు 12 పోటీ ముగింపు తేదీ తరువాత, 3 నెలల లోపున, మొదటి రెండవ, మూడవ బహుమతులు గెల్చుకొన్న వారి పేర్లు ప్రముఖ దిన పత్రికలలో ప్రకటించబడును 13 విజేతలందరికీ పోస్టు ద్వారా తెలుపబడును 14 హిందుస్థాన్ లీవర్ లిమిటెడ్, మరియు వారి ప్రచార సంస్థల ఉద్యోగులు, వారి కుటుంబ సభ్యులు మినహాగా, తదితర భారతదేశ వాసులందరు ఈ పోటీలో పాల్గొనుటకు అర్హులు 15. కంపెనీవారి ఏకైక నిర్ణయానుసారం, ఎంట్రీలు దాఖలు చేయు గడువు తేదీ పొడిగించబడ వచ్చును.




హిమాలయా బొకే టాల్కం మిమ్ము రోజంతా తాజాగా, పరిమళవంతంగా ఉంచును



1వ ఏప్రిల్ 1970 కి ముందటి తేదీలు వేయబడియున్న క్యాష్ మెమోలు పోటీకి అనర్హములు




### జరిగిన కథ

స్వామికి స్కూల్లో టీచరు ఉద్యోగంతోపాటు రఘుపతిగారింట్లో ఆశ్రయంకూడా దొరకటంతో అదృష్టవంతుడిని అనుకున్నాడు. అయితే రఘుపతి గారమ్మాయి పావనికి ప్రైవేటు చెప్పాల్సి వచ్చే టప్పటికి అతడికి పచ్చి వెలక్కాయ గొంతున పడ్డట్లయింది. పావని గడుగ్గాయి. ఎప్పుడూ నవ్వుతూ నవ్విస్తూ వుండే ఆ అమ్మాయి స్వామికి కాస్త ఇబ్బందిగానే తయారయ్యింది. పావనికి సంబంధాలు వస్తున్నాయి పోతున్నాయి. ఒకటీ కుదరడం లేదు. తల్లి రాయించిన ఉత్తరంతో స్వామి మనసు వద్దన్నా పావనిపై మోజు పడుతోంది.

## 10

ఒకే రాత్రి—

ఒకే యిల్లు—

కమ్మని కలలు కంటూ నిద్రపోతున్నాడు స్వామి—

తన ఇంటిని గురించి — తనకు భార్యయ్యే జీవితాన్ని సుఖశాంతులనూ కన్నీటినీ భవిష్యత్తునూ పంచుకోబోతున్న పావనిని గురించి — తనకు మాత్రమూర్తియై, జీవితాన్ని తీర్చిదిద్ది, తన కోసం కష్టాలన్నీ కన్నీటినీ తృప్తిగా భరించి—తన నీడలో — తమ దంపతుల సేవలో—సుఖ శాంతులతో శేష జీవితాన్ని గడపబోతున్న తల్లి సీతమ్మగారిని గురించి ... రకరకాల కలలు, రంగు రంగుల అలలై—నింగికెత్తి మనస్సును—నిలుపుతున్నాయి మరొక లోకంలో.

అదే రాత్రి—

అదే యిల్లు—

అవరి గదిలో అస్పష్టమైన భయాల బరువుకు నిద్రలేమి తోడు కాగా — నలిగిపోతున్న పావని మనస్సు—పెళ్లి మలుపు కావల దాగి—కంటికి కనిపించని భవిష్యత్తును — పోల్చుకుంటానికి ప్రయత్నిస్తున్నది.

స్వామిపట్ల తనకు ద్వేషం లేదు. ఆపేక్ష లేదు. అసలు నిశ్చింతగా ఒక అభిప్రాయమంటూ లేదు.

సగం సగం మగతలో స్వామిని భర్తగా ఊహించుకుని — తన జీవితం ఎలా వుంటుందో చిత్రించుకుంది పావని మనస్సు.

తండ్రి పడుతున్న బాధలో న్యాయముందనిపించింది. పెళ్లి చేసుకుని—పిల్లలను కని—చాలీ చాలని జీతంతో సంసార రథాన్ని గానుగెద్దులాగా లాగుతూ —గమ్యంతో సంబంధంలేకుండా తిరిగే గానుగెద్దులాంటి జీవితం! బడినుంచి ఉస్సురుమంటూ భర్త యింటికి వస్తాడు. సైనులాల్చీ విప్పి దండెంమీద గిరవాటు పెడతాడు. చిటికెడు ఉప్పు వేసి తానందించిన గ్లాసెడు మజ్జిగనూ అమృతంలా త్రాగి—అరుగుల మీద సర్కస్‌చేస్తున్న ట్యూషన్ కుర్రాళ్లతో యుద్ధానికి బయలుదేరి—చేసినంతసేపు సాముచేసి — గుబులుమళ్లి—తటాలున లేచి వంటగదిలో తిరగమోత పెడుతున్న తన ప్రక్కన పీట వేసుకు కూర్చుని లాలనగా వీపు నిమురుతాడు. ఏ మున్సబుగారో పంపిన ములక్కాయ ముక్కలతో తాను కాచిన కందికట్టు గరిటలో పోసుకు త్రాగి రుచి చూసి 'బ్రహ్మాండం' అంటూ చెంప మీద చిటిక వేస్తాడు. లొట్టలువేస్తూ జుర్రుకుతింటాడు. రైలు పొగలా దుమ్ము లేపుతున్న దుప్పటిని దులిపి, పక్కవేసిన నులక కుక్కిమీద—పవ్వళిస్తాడు, పకపక నవ్వుకుంటూ బళ్లో కుర్రకుంకలతో తాను ఆడిన చమత్కారపుమాట ఏదో గుర్తుకు వచ్చి.

ఆ నులకమంచం—

దానిమీదనే తామిద్దరూ ముచ్చట్లు చెప్పుకోవాలి.

కోపాలూ తాపాలూ తీర్చుకోవాలి.

తన సౌందర్యానికీ, యౌవన సౌభాగ్యానికీ—కాంక్షల వెల్లువకూ కన్నీటి వరదలకూ— అదే హంసతూలికాతల్పం— అదే రంగస్థలం — అదే సాక్షి. అదే తోడు. భారీ వర్షాలలో ఆ మూలనుంచి ఈ మూలకు — వీలునుబట్టి రంగులుమార్చే రాజకీయ నాయకునిమాదిరి— అది మారుతున్నా — తన బాధ్యతను విస్మరించదు

ఆ మంచంమీద కూర్చునే — ఆరురూపాయల అద్దె గుంజుతున్నా — యిల్లు కప్పించని కామందును గురించి రహస్యంగా తిట్టుకోవాలి. పాతికేళ్ళ సర్వీసయ్యాక — రిటైరయ్యాక — సర్కారువారిచ్చే — పదిహేను వందల ప్రావిడెంటుఫండును గురించి తమలో తాము పోట్లాడుకోవాలి. చంటిగాణ్ణీ — వెంటిగాణ్ణీ తలోకళ్ళా ఎత్తుకుంటూ జిల్లాబోర్డు ఆస్పత్రి చుట్టూ ప్రదక్షిణం చేసొచ్చి — డాక్టరుగారి సహాయాన్ని తలుచుకుంటూ — ఆ నులక మంచంమీద కూలబడే — తాము నడుం వాల్చుకోవాలి.

తనకు ఏదో అన్యాయం జరుగుతున్నట్లు బాధపడింది. ఎవరితో చెప్పుకోవాలి తన మనస్సుని? తల్లితో చెప్పాలని లేదు. తండ్రికి చెప్పి ప్రయోజనం లేదని అర్థమయింది. తెల్లవారగనే భారతి దగ్గరకు వెళ్ళింది చివరకు.

స్నేహాలు రకరకాలు.

చిన్ననాటి స్నేహం పావనిదీ భారతిదీ.

జరిగిన కథంతా చెప్పింది పావని. తండ్రి పడుతున్న బాధనూ — తన మనస్సులో మెదులుతున్న ఆలోచనలనూ చెప్పింది. ఆత్మీయత — ఆపేక్ష వున్న మనిషి గనుక — పావనిని అక్కున జేర్చుకుని వోదార్చింది. పెళ్ళి అవగానే ఆడపిల్లలకు సహజంగా వచ్చే పెద్దరికంతో 'ఏం చేయనే' అని పావని అడిగినప్పుడు తనకు న్యాయమనిపించిన సలహా చెప్పింది భారతి ఆప్యాయంగా అరమరికలు లేకుండా. ఇంతవరకూ పిచ్చాపాటీ మాట్లాడుకునే వరకే వాళ్ళ స్నేహం పరిమితమై ఉండేది. నిజానికి కవలపిల్లల్లా అతుక్కుపోయి తిరిగేవాళ్ళు యిన్నాళ్ళూ. ఒకళ్ళ బట్టలు ఒకళ్ళు కట్టుకునేవారు. క్రమ క్రమంగా పావని ఒత్తరి మనిషి కావడంతో భారతి జాకెట్లు తొడుక్కోగానే పిట పిటలాడి చిట్లిపోయేది. ఫక్కున నవ్వేది భారతి. జరగబోతున్న భారతి పెళ్ళిని గురించి — ఇద్దరూ గంటల తరబడి ఒకరి చెవులొకరు కొరుక్కుంటూ చర్చించుకునే వాళ్ళు, అతుక్కుపోయినట్లు కూర్చొని. ఆ సందర్భంలో శారదమ్మగారి కేకలు పావని చెవుల్లో పడేవి కావు. వీళ్ళ గుసగుసలు చూసి — 'ఛీ పాడు కబుర్లు — ఏముంటాయే బాబూ అంతగా గంటల తరబడి కబుర్లు చెప్పుకుంటానికి — ఎక్కడనుంచి ఊరుకొస్తాయో అన్ని రహస్యాలు వాళ్ళకి' అని తక్కిన ఆడపిల్లలు. అసూయపడటం కూడా హాయి అనిపించేది వాళ్ళిద్దరికీ.

భారతి అత్తవారింటికి మొదటిసారి వెళ్తున్నరోజున ఇద్దరూ తనివి తీర కావలించుకుని ఏడ్చారు.

'ఈ శుభసమయంలో ఈ శోకాలేమిటమ్మా విడ్డూరం మరీను —' అంది కరణంగారి అమ్మాయి.

'ఎందుకే ఏడుపు?' అంది కళ్ళు తుడుచుకుంటూ పావని.

'నిన్ను వదిలిపోవాలంటే బాధగావుందే' అంది భారతి మరోసారి పావనిని, గుండెలకు హత్తుకుంటూ.

'ఇద్దరంలో ఏ ఒకళ్ళు మగ జన్మెత్తినా సరిపోయేది'

ఏడుస్తూ నవ్వింది భారతి.

నవ్వుతూ ఏడ్చింది పావని.

అటువంటి గాఢస్నేహం పెనవేసు



కున్నది గనుకనే-ఆ సమయంలో అదృష్ట వశాన పుట్టింటికి వచ్చిన భారతి దగ్గరకు వెళ్ళగలిగింది పావని.

భారతి మాటలన్నీ విన్నతర్వాత, తన ఆలోచనలన్నీ చెప్పుకున్నాక, పావని మనస్సు కొంత తేలికపడింది. అలాగే మాట్లాడి మాట్లాడి, మౌనంగా కూర్చుండి పోయారిద్దరూ. స్వామి రూపం కళ్ళముందు మెదిలింది మరొక సారి పావనికి. లేత తమలపాకు లాంటి శరీరం స్వామిది. అందులో అంతో ఇంతో స్త్రీత్వం తాలూకు నాజూకు తనమున్నది. అప్పుడే తెలుపువిరిగి నీరి మకు విరుగుతున్న గడ్డం — నక్షత్రాల జన్మ రహస్యాన్ని గురించో, నభోమండల జ్యోతులతో విడదీసిన—పద్య రహస్యం గురించో పాఠం చెబుతున్నప్పుడు గిరత్నోమోగే అతని కంఠంలోని ఆర్ద్రత, వంటచేస్తూ తిరగమోతల గుభాలింపు కేటుకుర్ని వర్షిస్తున్నప్పుడు అమాయకంగా అతనికళ్ళల్లో తొంగిచూసే గర్వం—మనస్సులో మెదిలి, 'మంచివాడే వే పాపం—' అంది పావని.

'ఎవరే?' అంది భారతి చిరునవ్వుతో పెదిమలు విప్పుకుంటూ.

'తనే'

'తనంటే?'

'పోవే! నీకు తెలీదూ! నా నోటితో చెప్పించాలని'

'నువ్వు ఎన్నిసార్లు చెప్పించలా నా నోటితో? చెప్పుదూ ఎవరే అతను'

'మాష్టారే'

ఎర్రబడింది పావని నవ్వు

నేస్తం బుగ్గగిల్లి 'ఊహూఁ కూత పట్టిందే పిట్ట' అంటూ విరగబడి నవ్వింది భారతి.

'విజయనగరం సంబంధం చేయలేకపోతే బండరాయి కట్టుకొని బావిలోపడతాను' అని ప్రతిజ్ఞచేసిన రఘుపతిగారు అటువంటి అఘాయిత్యం చేయకపోగా, సలక్షణంగా భార్యాసమేతంగా ఘనంగా పీటల మీద కూర్చున్నారు. స్వామి కాళ్ళుకడిగి కన్యధార పోశారు.

పెళ్ళికి రారనుకున్న మేనమామ మంగపతిగారు సకుటుంబంగా తరలి వచ్చారు.

## మమత

ఆ తర్వాత పెళ్ళినాటి ముచ్చట్లు ఎప్పుడు తలుచుకున్నా తుళ్ళిపడేవాడు స్వామి.

'దమ్మిడి కట్నం యివ్వకుండా స్వామినిబుట్టలో వేసుకున్నాడు. రఘుపతి' అంటూ వ్యాఖ్యానించాడు పరాంకుశం.

'మా అక్కయ్యను చేసుకుంటావనుకున్నాం బావా' అన్నాడు అమాయకంగా 'మంగపతి మామయ్య' కొడుకు వెర్రి శంకరం

'వీరా ఆయనకు కాపు పెట్టించే భారం నీది తల్లీ యింక' అంది భారతి మధుపర్కం సవరిస్తూ.

'అంతా చల్లగా చూశాడు భగవంతుడు అదే పదివేలు' అనుకుంది సీతమ్మగారు.

'వెర్రికుట్టే వదినగారూ మాపావనమ్మ. వీరా చేతుల్లో పెడుతున్నా, ఎలా కడుపులో పెట్టుకుంటారో' అంటూ సీతమ్మగారి రెండుచేతులూ పట్టుకుని ఆ చేతులతో తన ముఖం కప్పుకుని బావురుమంది శారదమ్మగారు.

'నాకు కొడుకూ — కోడలూ — ఆ ఇద్దరూ రెండు కళ్ళు వదినా. నీకు అటువంటి భయం అవసరంలేదు' అంది సీతమ్మగారు.

స్కూల్లో టీచర్లందరూ కలసి తలకు రెండురూపాయలు చందా వేసుకుని ఒక పింగాణీ టీ సెట్టు కొని ప్రజెంటిచ్చారు దంపతులకు 'సంతోష భాష్పాలు' అంటూ పంచరత్నాలు స్వయంగా వ్రాసి, గంభీరంగా చదివాడు పెళ్ళి పందిట్లో పరాంకుశం. కోనేటిరావు కక్షలు మరిచి పెళ్ళికొచ్చి స్వయంగా పెళ్ళికూతురుకు నూటపదహార్లు చదివించాడు. వెంకన్న బంటొద్దు బండెక్కి నూతన దంపతు లిద్దరూ ఊరికి రెండు మైళ్ళ దూరంలోగల ఆంజనేయులవారి గుడికివెళ్తూ — కన్నెపిల్ల తొలివలపుల విరుపుల్లా కొంచెం కొంచెం విచ్చుకుంటూ, ఎదుటపడుతున్న తాటివనాల డొంకదారి వంకరలుదాటి ఎగిరిపడిన బండితోపాటు జారిపోతున్న పెళ్ళికుమార్తెను చూసి 'పైకి జరగండి కొంచెం — పడతారు జారి' అన్నాడు స్వామి.

'మీరిలా గట్టిగా పట్టుకుంటే నేనెక్కడ పడతానులెండి' అంది నవ్వుకుంటూ పైకి జరుగుతున్న పావని.

'మీరు కొట్టండి ముందు కొబ్బరికాయ' అన్నాడు స్వామి నవ్వి.

'ఆ అండీ— యింక కట్టిబెట్టాలండీ మీరు'

'సరేనండీ'

ఇద్దరూ నవ్వేరున్నారు. గుడి మంటపంలో చలికి లబడి కూర్చుని — అల్లంతదూరంలో రావిచెట్టు క్రిందున్న పాములపుట్టను చూస్తూ — కొబ్బరి ముక్కలు తిన్నారిద్దరూ మౌనంగా మాట్లాడుకుంటూ

* * *

ఒకే యిల్లు—

ఒకే రాత్రి—

'ఒకసారి యిలారండీ—' అన్నాడు స్వామి.

'ముందు ఆ అండీ తీసెయ్యండి మరి' అంది పావని.

'ఎలా?'

'మీకు తెలీదూ'

'అలవాటైపోయిందండీ'

'మానుకోవాలండీ'

'ఏం చేయమంటారు?'

నాకూ ఒక పేరుంది—'

'ఔను'

'అది మీకు తెలుసు'

'తెలుసు'

'.........' అంది పావని తల వంచుకుని.

'.........' అన్నాడు స్వామి ఆముఖాన్నే చూస్తూ.

'.........' ఇది పావని ప్రశ్న.

'.........' అది స్వామి జవాబు.

మా అమ్మ—' అన్నాడు స్వామి అప్రయత్నంగా.

'ఇప్పుడెందుకు గుర్తొస్తారండీ ఆవిడ.'

'ఎప్పుడూ గుర్తొస్తుంది, మరిచి పోలేను.'

నిచ్చనలు వేసుకుని—కిటికీ సందులను చూసుకొస్తు నిరీక్షిస్తున్న అమ్మలక్కలు

# రామయ్య తెలివైనవాడు: ధాన్యము సిమెంటు కొట్టులో మాత్రమే భద్రంగా ఉంటుందని అతనికి తెలుసును!



సిమెంటు కొట్లు మాత్రమే మీరు చెమటోడ్చి పండించిన ధాన్యమును నిప్పు, నీళ్లు, ఎలుకలు, పురుగులు మొదలగు వాని బారినుండి సురక్షితంగా ఉంచుతాయి.

పెద్ద లేక చిన్న కొట్లు, నేలమీద లేక నేల క్రింద —ఎక్కడైనా సరె సిమెంటు కొట్లు దృఢంగా ఉండి, చాలా కాలము నిలిచి ఉంటాయి. ఈ కొట్లను సులభంగా, చవుకగా ఏసిసి సిమెంటుతో కట్టవచ్చును.

నష్టములను అరికట్టి, పెద్ద పెద్ద లాభాలను సంపాదించుటకు మీ డబ్బును వివేకంగా ఖర్చు చేసి ఏసిసి సిమెంటుతో కొట్లు కట్టండి. 50 ఏళ్ళకు పైగా ఇది మొదటి రకము సిమెంటు అని పేరుగాంచినది.

**మీ సిమెంటు అవసరములకు సమీపంలో నున్న ఏసిసి స్టాకిస్టును గాని లేక, ది సిమెంట్ మార్కెటింగ్ కంపెనీ ఆఫ్ ఇండియా లిమిటెడ్, ధన్ బిల్డింగ్, 175/1, మౌంట్ రోడ్, మద్రాసును గాని సంప్రదించండి.**

ది కాంక్రీట్ అసోసియేషన్ ఆఫ్ ఇండియా, రహమత్ బిల్డింగ్, 66 ప్ర, రాష్ట్రపతి రోడ్, సికిందరాబాద్. యొద్ద మీకు సాంకేతిక సహాయము ఉచితంగా లభిస్తుంది.

**ACC**
రైతుల మిత్రము

ది అసోసియేటెడ్ సిమెంట్ కంపెనీస్ లిమిటెడ్
ది సిమెంట్ మార్కెటింగ్ కంపెనీ ఆఫ్ ఇండియా లిమిటెడ్ CMI 9263

ఆశాభంగంతో చల్లబడిపోతున్నారు.

'ఎందుకండీ ఆ కంట తడి—?'

'మా అమ్మ—'

'బాగానే ఉన్నారు గదా? ఈ సమయంలో అలా ఉంటే—'

'నీకు చెప్పాలి పావనీ—నాకోసం బ్రతికింది. పడరాని పాట్లు పడింది. ఈ ఋణం తీర్చుకోవాలి నేను. అందుకు నీ సహాయం కావాలి. దేవత అమ్మ. నీకు తెలియదు. అందరిలాంటి అమ్మ కాదు. అమాయకురాలు.'

భర్త చెంపలవెంట కారుతున్న నీరు తుడుస్తూ 'ఎంత అమాయకులండీ' అంటూ నిట్టూర్చింది పావని.

'కాదు పావనీ. అమ్మను ఎలా చూసుకోవాలి మనం? ఏ కొడుకూ ఏ తల్లినీ ప్రేమించనంత ఇదిగా, ఏ కోడలూ ఏ అత్తకూ చేయనంత ఇది, ఆమె ఉంటే చాలు. రా—ఆమెకు నమస్కరిద్దాం.'

చేయి పట్టుకుని పావనిని గోడ దగ్గరకు తీసుకు వెళ్ళాడు స్వామి. అది అంతకు ముందు స్వామి అద్దెకున్న గది. గోడ మీద రెండు ఫోటోలున్నాయి. ఒకటి తల్లి సీతమ్మగారిది. రెండవది నీను ప్రభువుది.

'మీ అమ్మగారంటే మీకంత యిష్టమాండి?'

'ప్రాణం.'

'మరి నేను?'

'అమ్మ తర్వాత నువ్వే నాకు ఈ ప్రపంచంలో మిగిలింది. నీకు మాత్రం తెలియదూ?'

'పోనీలెండి అమ్మగారితర్వాత నువ్వు—అన్నారు సంతోషం కాని మానాన్నగారి తర్వాత మీరు—అని నే ననలేను మరి. పడుకుందాం. నిద్రొస్తూంది!'

'అటు జరగండి'

'ఆ దిక్కుమాలిన' అండి మిమ్మల్ని వదిలిపెట్టదా ఏమిటండీ?'

'ఈ రాత్రి నాకు నిద్రరాదు పావనీ'

'ఏం చేద్దామంటారు?'

'ఇలా జరుగుతుందని నేను అనుకోలేదు'

'జరిగింది గదా?'

'భార్య అంటే అర్థం నీకు తెలుసా?'

'ఊఁ'

'ఏం తెలుసు చెప్పు?'

'... మీరు ... పా శా లు

# మమత

చెప్పడం నీకలవాటు'—జారింది నీ!

'అది బలే. ప్రయివేటులో నువ్వు నాకు చెప్పేది ఎక్కువ. ధర్మపత్నికి నిర్వచనం కాళిదాసు ఏం చెప్పాడో తెలుసా?'

'తెలియ చెప్పండి స్వామీ అజ్ఞానురాలిని'

'పావనీ—'

'ఆగండి కామమ్మ అత్తయ్య కళ్లను ఇంటా మెరుస్తున్నాయి లటక పందు మంచి'

దీపం తగ్గించింది పావని.

చీకటిలో మెరిసాయి పావని కళ్ళు.

కలలకూ జీవితానికీ తేడా వుందని ఎంచలేదు వాళ్లిద్దరికీ అనాడు.

* * *

కాని—కలలు వేరు జీవితం వేరు.

మనిషి జీవితంలో వివాహమనేది అతి విచిత్రమైన మలుపు. ఎక్కడో పుట్టిన ప్రాణి—మరెక్కడో పుట్టిన మరొక్క ప్రాణి—వివాహ బంధంతో ఒక్కటిగా కలసి—రెండు జీవితాలనూ కలబోసుకుని భవిష్యత్తులను పంచుకుని—ఒకరి కౌగిటిలో ఒకరు చలికాగి—ఒకరి సన్నిధిలో ఒకరు స్వర్గ నరకాలను అనుభవించి—ఆ బాంధవ్యానికి చిహ్నంగా — పుడమి తల్లికి బిడ్డలపేరుతో తమ వారసత్వాన్ని అప్పగించి పోవడం చిత్రంగానే కనిపిస్తుంది.

అందుకనే—

'జీవితంలో ఇది అతి విచిత్రమైన మలుపు' అని వ్యాఖ్యానించడం, అతిశయోక్తి కాదనిపిస్తుంది. ఆ మాటలో అత్యుక్తి లేదనిపిస్తుంది.'

రెండు జీవితాలపైనను అనల్పమైన ప్రభావం ప్రసరిస్తుంది వివాహం. స్త్రీ జీవితం మరీ మారిపోతుంది సాధారణంగా.

కాని—

స్వామి విషయంలో అలా జరగలేదు. వేరొక యింట్లో కాపురం పెట్టటానికి రఘుపతిగారు అంగీకరించలేదు. 'ఎక్కువకాలం బ్రతకను బాబూ! బ్రతికినంతకాలం నా కళ్ళముందుండండి. కనీసం ఈ వూళ్ళో ఉన్నన్నాళ్లూ' అంటూ దీనంగా అర్థించారు మామగారు తన భార్యతో వేరే కాపరం పెట్టి తన బ్రతుకు

తాను బ్రతకడం మంచిదని పించింది కాని రఘుపతిగారి పట్టుదలవలన తన నిర్ణయం మార్చుకోక తప్పిందికాదు.

'మనుషులు మంచివాళ్లే అనుకో, అయినా అయినవాళ్లకు కొంచెం దూరంగా వుండటం మంచిది రా స్వాములూ' అంది చూడటానికి వచ్చిన తల్లి సీతమ్మగారు. ఏమైనా అప్పటికి వేరే కాపురం పెట్టలేక పోయాడు స్వామి.

'నువ్వూ నాతో ఉండిపోమ్మా' అని ఎన్నోవిధాల బలవంతపెట్టి చూశాడు. 'కొన్నాళ్ళు పోనీరా నీ దగ్గర ఉండక ఎక్కడుంటాను? అవధానిగా రమ్మాయికి పెళ్ళి అంటున్నారా, ఆవిడా పెద్దదైపోయింది. యింతకాలం ఉండి అవసరానికి తప్పుకుంటే ఏం బావుంటుంది గనుక బోలెడు పెళ్లి పనులాయె' అంటూ సమాధానం అప్పటికి చెప్పింది సీతమ్మగారు.

తాను అత్తవారింట్లో కలిసి ఉండటం తల్లికి యిష్టంలేదని గ్రహించాడు స్వామి.

* * *

స్వామి ఆనాడు స్కూలుకు వెళ్లేసరికి స్టాఫ్ రూంలో పరాంకుశం గంభీరోపన్యాసం కొనసాగిస్తున్నాడు. స్వామి వచ్చిన సంగతి తను గమనించినట్లు గుర్తుగా పెదవులు రవ్వంత ఎడమ ప్రక్కకు మాత్రం సాగదీసి—నవ్వులాంటి భావం పలికించి, తన ధోరణిని కొనసాగిస్తున్న ధోరణిలో 'ఏమంటారు మాష్టారూ!' అన్నారు తెలుగుపండితులవారిని ఉద్దేశించి.

'అంతే మరి' అన్నారు తెలుగు పండితులు అజాత శత్రువుగా బ్రతకడం మరీ వంటబట్టి.

అసలు ప్రపంచంలో ఏ విషయం గురించిగానీ, వ్యక్తిని గురించిగానీ, తెలుగు పండితులవారికి ఒక అభిప్రాయముంటూ వున్నట్లు కనిపించదు. తెలుగు వ్యాకరణంగాక మరొక విషయం గురించి — జీవితంలో ఎన్నడూ ఎటువంటి వ్యాఖ్యానమూ చేయగూడదనే నిబంధన పెట్టుకున్న మనిషిలా కనిపిస్తారాయన. ఎవరేం చెప్పినా, ఎన్నిగంటలయినా శ్రద్ధగా వింటున్నట్లు కనిపించగల వోపిక ఆయనకు పుష్కలంగా వుండనే మాటమాత్రం ఎవ్వరూ కాదనరు. పరాంకుశంగారి

తత్వంవేరు. ఆయనకు సర్వప్రపంచంలో తెలియని విషయమంటూ వున్నట్లు కనిపించదు. అంతక్కుమించి తాను మహా మేధావుల కోవలోకి చెందినవాణ్ణని, ప్రతికరణ శుద్ధిగా నమ్మినా జీవితం అతనిది పాపం.

అందుకనే ఆటంబాంబు దగ్గరనుంచి అల్లం పచ్చడిదాకానూ, పరిణామ సిద్ధాంతం దగ్గరనుంచి పెసరట్లదాకానూ—తిరుగులేని అధికారంతో ఆయనగారు తక్కిన అజ్ఞానులకు సవ్యాఖ్యానంగా వివరించి చెప్పడం పరాంకుశంగారికి అలవాటైపోయింది.

స్వామి తలవంచుకుని కుర్చీలో చతికిలబడ్డాడు బరువుగా. పరాంకుశంగారి చూపు స్వామిమీద పడింది.

'ఇంత వయస్సువచ్చినా నేను ఎందుకు పెళ్లిచేసుకోలేదో తెలుసా?' సూటిగా అడిగాడు పరాంకుశంగారు ఈసారి స్వామిని.

తల నెరుస్తున్నా — యింతకాలంగా వివాహం చేసుకుంటానికి పరాంకుశంగారు ఎందుకు తటపటాయిస్తున్నారో స్వామికి బొత్తిగా తెలియదు. తెలుసుకోవాలనే జిజ్ఞాసకూడా లేదు.

'నా వయస్సు ఎంతంటావ్?'

బోనులో ముద్దాయిని నిలబెట్టి సవాలు చేస్తున్న ప్లీడరులా అడిగాడు పరాంకుశం.

'నాకు తెలియదండి' అన్నాడు స్వామి.

'అహ! ఊజ్జాయింపుగా చెప్పు పోనీ' చెప్పలేకపోయాడు స్వామి.

పరాంకుశం జాలిపడుతున్నట్లు నవ్వి 'నలభై రెండు. గట్టిగా మాట్లాడితే నలభైనాలుగు. చేసుకోమని చాలామంది ప్రాణాలు తీశారు. వేలకువేలు కట్నాలు ఆశపెట్టారు. కాని నా నిర్ణయం మారలేదు. కారణం నాకు తెలుసు. పెళ్లి అనేది ఒక బందిఖానా. ఒక అగ్గిపెట్టె లాంటి బందిఖానాలో యిల్లాలి పేరుతో ఒక గుదిబండను తగిలించి వదిలిపెడతారు మహాసముద్ర మధ్యంలో— మా కవికూన అన్నట్లు. పారిపోయి బ్రతకడానికి వీలు లేకుండా సవాలక్ష కట్టుదిట్టాలు. కొత్త బట్టలుకట్టి ముస్తాబు చేసి, బాజా భజంత్రీలతో ఆకారాగారంలోకి తోస్తారు పదిమందీకలిసి. భార్యాభర్తలు — ఒకరి నొకరు కొనుక్కుతింటానికి ప్రయత్నం. ఆకలి మండుతున్న మనిషి — గడ్డి

# అలవాట్లూ-ఆమ్యామ్యాలూ









తింటాడు. ఆ తర్వాత? మాత్రపోదున్న పంచదార పొర కరిగిపోతుంది. ఒకరి కొకరు కొరుకుడు పడరు. ఒకరిమాట ఒకరికి అర్థంకాదు. ఇద్దరూ మాట్లాడు తూంటారు గొంతులు చించుకుని. సప్త సముద్రాలూ దాటి వినపడతాయి ఆ కేకలు తక్కిన లోకానికి. ఒకళ్లకొకరు కొరుకుడు పడక— పడుతున్న జీవులవేదన— అరిచి అరిచి ఆ జైలు నుంచి బయటపడే మార్గం లేదని తెలుసుకుంటారు. తెలుసు కునేసరికి రెక్కలు విరిగి, తలుపులు తెరిచినా బయటకు పోగల వోపిక ఏ ప్రాణికీ వుండదు. ద్వారాలు లేని ఏడు ప్రహరీ గోడల్లాంటి పిల్లలు పుట్టుకొచ్చి పారా కాస్తారు. దగాపడిన తమ్ముడు— ఆ యింటికి ఒక పెద్ద పాలేరు.' అంటూ అనర్గళంగా కొనసాగించి 'చిటికెడు నశ్యం ఇటు రానివ్వండి మాష్టరు' అంటూ చెయ్యి చాపాడు.

'లోకంలో అంతా వెర్రివాళ్లయ్యే చేసు కుంటున్నారంటారా పెళ్లిళ్లు?' అన్నారు కేవలం సందేహ నివృత్తి కోసమన్నట్టు తెలుగు పండితులు.

'అదొక లోతు తెలియని ఊబి మాష్టరూ! గట్టిగా మాట్లాడితే పాతె గూడంటాను. తెలియక దిగి, ఊపిరాడక కొట్టుమిట్టాడుతున్న వాళ్లు—బయట నున్న వాళ్లని రకరకాల మోసాలతో అందులోకి లాగుతారు జబ్బ పుచ్చుకుని. ఆ ఊబిలో అమృతముందని — ఏడుపు ముఖాలకు నవ్వు పులుముకొని వర్ణిస్తారు. ఈ విషాదం — ఈ దౌర్భాగ్యం — నే జయించాను. తన కూతుర్ని నాకు అంట గట్టటానికి ఆ రఘుపతి ఎంత ప్రయ త్నించాడో మీ కందరకూ తెలుసు—'

ఆ చివరి వాక్యం శూలం తగిలినట్లు తగిలింది స్వామికి. 'ఆ రఘుపతిగారి గొడవెందుకండీ మీకు. ఒకసారి గొడవ యింది గదా?' అంటూ మందలించాడు తోటి టీచర్ ముకుందం స్వామి అక్కడు న్నట్లు సైగచేస్తూ.

పరాంకుశంగారి మాటల్లో ఎంత నిజం వుందో స్వామికి తెలియదు. ఆ తర్వాత 'తమ్ముడూ! నువ్వు అక్కడే వున్న విషయం మరిచిపోయి నోరు జారింది, ఏం అనుకోకు' అవేశాడుతేలికగా.

'ఆ రోజంతా విరత మరిచి పోవాలన్నా, పరాంకుశంగారి ఉపన్యాసమే గుర్తుకు వచ్చేది స్వామికి. 'పెళ్లి—పాడుగూడు—ఊబి' ఈ మాటలు మాత్రం మరిచి పోలేక పోయాడు.

ఇంటికి నడుస్తున్నంత సేపూ ఆ క్రితం రాత్రి పావనితో జరిగిన సంభా షణే గుర్తుకు వచ్చింది స్వామికి.

ఆ రాత్రి—

భోజనమయాక తాంబూలం వద్దం టున్నా బలవంతంగా నోట్లో కుక్కింది పావని. కాదనలేక నమిలాడు. తన మాట —ఏదో పెద్దమాట — నెగ్గినట్లు నిండుగా గర్వంగా నవ్వుతూ 'పెదవులు మరీ ఎర్రబడ్డాయి మీవి' అంది పావని. నాలికకు చూడగల శక్తి వున్నట్లు — బడుద్ధాయిాల పరీక్ష పేపరు మీద సున్నా చుట్టినట్లు — పెదవుల మీద నాలికతో వో బండి సున్నా చుట్టాడు.

'శనివారం నా పుట్టింరోజు'—అంది పావని.

స్వామి గుండె గతుక్కుమంది. చీర కొనమంటుందేమో అనే భయం మెది లింది మనస్సులో.

'సంతోషం' అన్నాడు.

'మీ సంతోషం సరే. నన్నెలా సంతోష పెడతారో చూస్తా'

'ఎప్పుడు సంతోష పెట్టటంలానిన్ను'

'అలా కాదు'

'మరెలా'

'ఏం ప్రజెంటిస్తారో చూస్తా'

'ఏం ప్రజెంటు కావాలి'

'కర్నం గారమ్మాయికి బెంగుళూరు చీరిచ్చాట్ట మొగుడు'

'అలాగా'

'మూడొందలట్ట'

'అబ్బో'

'ముస్సబుగారి కూతురు పుట్టింరోజుకు పెద్ద హడావుడి చేశారు. బండెడు బహు మతులొచ్చాయి.'

'ఔను మరి'

నాకూ ఘనంగా పార్టీ చేయాలనివుంది'

మాట్లాడలేక పోయాడు స్వామి.

'ఆ భూతద్దాలనూ —భారతమ్మనూ అందరినీ పిలవాలని'

'నిద్రపోయినట్టు' — పడుకున్నాడు స్వామి. (ఇంకా వుంది)

# మెత్తని మృదువైన లేప్రాయపు ముఖవర్చస్సును ఇస్తుంది

# పాండ్స్ వానిషింగ్ క్రీమ్

ఆశ్చర్యమా? పాండ్స్ వానిషింగ్ క్రీమ్‌తో వుండే ప్రత్యేక హ్యూమెక్టెంట్ వల్ల మీ చర్మానికి సహజంగా వుండే తేమను వుంచడమేగాక దుమ్ము వాతావరణము నుండికూడ రక్షిస్తుంది. సమంగా మ్యాట్ ఫినిష్‌కు పాండ్స్ వానిషింగ్ క్రీమ్ ఒకటి ప్రత్యేకంగా వాడవచ్చు లేక గంటలకొద్దీ మీ సింగారం చెక్కు చెదరకుండా పునాది పౌడర్‌గా కూడా వుపయోగించవచ్చు.

4 సైజులలో లభ్యమయ్యే వానిషింగ్ క్రీమ్ ఇదొక్కటే— ఎకానమీ—లార్జి—మీడియమ్—స్మాల్




## పాండ్స్ వానిషింగ్ క్రీమ్ — విశిష్టమైన పౌడర్ పునాది

చెస్‌బ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్ (పరిమితమైన బాధ్యతతో యు.ఎస్.ఎ.లో స్థాపితము)




(గత సంచిక తరువాయి)

'అస్సలు బళ్ళో ఎలా వుంటదంటావ్...?' అన్నాడు యెంకటేశు కూతూహలంగా.

'ఎల్లా వుంటదేంటి? పెద్ద పెద్ద గదులుంటాయి పంతులుగారికి కుర్చీ వుంటది పిల్లలకి సీటులుంటాయి. నల్ల బల్లుంటాది అంది మీద పంతులు గోరు సీమ సున్నంతో రాత్తారంట. అది సూసి పిల్లలు పుత్తకాల్లో రాసుకుంటారంట... ఆ గదిలోనే ఆటలు నేర్పుతారంట— మొక్కలు పెంచుతారట—బొమ్మలెయ్యడం కూడా నేర్పుతారంట...'

'అదికాదురా సవటనాగన్నా... సదువు నేర్చుకోవడం ఎలా వుంటందీ అని...'

'ఓ...అదా... అది మనకెలా తెలుత్తాది? సదుముకుంటే గందా...?'

'పిల్లలంతా సదుముకునేప్పుడు యెల్లి సూత్తేనో...?'

'అ యమ్మబాబో... బళ్ళోకెల్లి సూడ్డమే...? అక్కడ పెద్ద పంతులో కుంటారంట. ఎప్పుడూ పింతబెత్తం పుచ్చుకుని బడీసుట్టూ తిరుగుతూ వుంటారంట. ఆయన గనక సూత్తే యింకేమన్నా వుందా? మొన్నా మద్దెన మేం జరిగిందో తెలుసా? మా కాపులింటి పిన్నబ్బాయి గోరులేరూ... ఆయన్ని పంతులు గోరుకొడ్తే తప్పె రవలా యింకా నొప్పి తగ్గలేదు. సదుముకునే వోళ్ళనే అలా కొట్టేత్తే...మనలాయితే యింకేమన్నవుందా 'సితకాబతకా సింతకాయ పచ్చడి సేసెయ్యరూ?'

అన్నాడు భయం భయంగా శంద్రిగాడు.

'దొంగసాటుగా సూత్తేనో...'

'సుట్టూ యింతెత్తు గోడుంది. గేటు కాడ బ్రమ్మరాచ్చసుడు గూసున్నాడు. ఎలా సూత్తవూ అంట. నువ్వూ నేనూ యిలాయిలోళ్ళు అస్సలు లోపలికి రానివ్వడం కాదుకదా...గేటుదగ్గరికికూడా రానివ్వరు ఏమోబాబా... నేను యింకాపోను ఎత్తను. ఎత్తనంటే ఎత్తను తలుసుకుంటేనే జడవు' అన్నాడు శంద్రిగాడు చెయిజాపుతూ.

వాడిచేతిలో ఒక గుబావు చింత కాయ ముక్కపెట్టి మవునంగా కూర్చున్నాడు యెంకటేశు కాస్సేపటికి అన్నాడు—

'హారే...జగ్గూ, నాకో సాయం సెయ్యరా సేత్తావా...?'

'ఏంటది?'

'యియ్యాల బడివుందిగదా...?'

'వుంది...'

'నేను హొకసారి బడిదగ్గరకెళ్ళి హొచ్చేత్తాను. ఈలోగా నా దూడల్నిసూత్తూ వుండు. ఇప్పుడే సిటికెలో వచ్చేత్తాను...'

'మరయితే వచ్చేప్పుడు వుప్పూ కారం కూడా తెత్తావా... జగ్గులుగాడి దగ్గర బోల్డన్ని సింతకాయలున్నాయి. పట్టెయ్యి తింటే పులుపుంటాది.'

'అలాగే తెత్తానుగాని... నువ్వు నా దూడల్ని సూత్తావుండు...' అంటూ ఒకటే పరుగుతీసి బడిదగ్గరికి వొచ్చేశాడు యెంకటేశు.

బడిచుట్టూ పెద్దకాంపవుండు వుంది దానికీ పెద్దగేటు. గేటుమీద స్కూలు పేరూ అదీ రాసివుంది. పరిశీలనగా చూశాడు యెంకటేశు.

గేటువోరగా తీసేవుంది. మీసాలసామి జాడ ఎక్కడాలేదు ఫరవాలేదను కున్నాడు. పిల్లిలా నెమ్మదిగా అడుగులో అడుగేసు కుంటూ లోపలికి వెళ్లాడు. అక్కడి దృశ్యంచూసి తన్ను తాను మరచి పోయాడు.

చెట్లూ, రకరకాల మొక్కలూ, పూల పొదలూ అందంగా అలంకరించిన రంగు కాయితాలతో నందనవనంలా వుంది.

ఎక్కడో అలికిడైంది, వెంటనే ఒక చెట్టుచాటున నక్కాడు. మీసాలసామి అటే వెళ్లాడు కాని యెంకటేశుని చూళ్లేదు. 'హమ్మయ్య' అనుకున్నాడు. ఇప్పుడు బడిలోపలికి నిరాటకంగా వెళ్లి పోవచ్చు. చెట్లు అడ్డున్నాయి మీసాల సామీ కనిపించడు.

వరండాదాకా దొంగలా శబ్దం చేయ కుండా వెళ్లాడు. కాని ఇక ముందుకు వెళ్లడానికి ధైర్యం చాల్లేదు, గుబురుగా పెరిగిన ఒక మొక్కచాటున దాకున్నాడు.

అక్కడినుంచి చూస్తుంటే వరసగా చాలాగదులు కనిపిస్తున్నాయి అవే చదువుకునే గదులై వుండాలి. కొంచెం ధైర్యంచేస్తే ఒక గదిని చేరుకోవచ్చు. వెళ్లడానికి ఉద్యుక్తుడవుతుండగా— దూరంగా ఒకగది తలుపు తెరుచుకుంది. అందులోనుంచి లావుపాటాయన ఒకరు వరండామీదకు వచ్చారు. ఆయన చేతులో పొడవాటి చింతబరిక వుంది'

'అమ్మ బాబో...పెద్దపంతులోడు !'

యెంకటేశుకి పై ప్రాణాలు పైనే పోయాయి.

'పెద్ద పంతులోరి కళ్లబడితే సంపే త్తారు.'

అన్న శంద్రిగాడి మాటలు చెవుల్లో గింగురుమున్నాయి. యెంకటేశుకి వొళ్లంతా చెమటపట్టింది.

చింత బరికాయన ఇటే వస్తున్నాడు. తనవైపునే వస్తున్నాడు. ఎలా...ఎలా ?

వస్తూ వస్తూ ఏం జ్ఞాపక మొచ్చిందో ఏమో ఆయన మళ్లీ వెనక్కితిరిగి ఆ వైపుకు వెళ్లిపోయాడు.

'హమ్మయ్య...' అనుకున్నాడు యెంకటేశు.

ధైర్యం తెచ్చుకున్నాడు. వూడిపోయే లాగూ రెండుసుతలూ లాగి గట్టిగా ముడేశాడు. దానిమీద మొలతాడు గట్టిగా అదిమిపట్టేలా బిగించాడు. ముక్కు శుభ్రం చేసుకుని ముందుకి సాగిపోయాడు.

అక్కడో తరగతి గది వుంది. గుమ్మంలో నుంచి నెమ్మదిగా తొంగిచూశాడు. పిల్ల లంతా బెంచీలమీద కూర్చుని వున్నారు పంతులుగారు కనపడ్డం లేదుగాని ఆయన కంఠం వినిపిస్తోంది ఆయన ఏదో చెబుతున్నారు. పిల్లలు చెవులు రిక్కించుకుని వింటున్నారు. ఆయన చెప్పేది యెంకటేశుకి వినపడుతున్నది గాని అర్థం కావటంలేదు

ఆ వాతావరణాన్ని చూస్తే యెంకటేశుకి యెంతో ముచ్చటేసింది పంతులు గారు చెప్పేది ఏమీ అర్థంకాక పోయినా శ్రద్ధగా ఆనందంగా వినసాగాడు.

'తల్లి పాలిచ్చి పెంచి పెద్దచేస్తుంది, బడి విద్యాబుద్ధులు గరపుతుంది. బడి— తల్లి రెండూ సమానం...'

పంతులుగారు ఏమేమో చెప్పుకు పోతున్నారు.

యెంకటేశుకి అర్థమయ్యిందొక్కటే. 'బడి' 'అమ్మ' ఇద్దరూ ఒకటే అంట్రది. అమ్మగురించి చాలాచెప్పా రాయన. ఆయన చెప్పినదానిలో 'మచ్చుకి ఒక గుణమయినా అమ్మలో లేదు–' అనుకున్నాడు. అందు కని అమ్మకంటేకూడా బడి ఎక్కువ గొప్పది అనే నిర్ణయానికి వచ్చాడు. అమ్మనీ—బడినీ పోల్చుకుంటూ— వాటిని గురించి ఆలోచిస్తూ ఎంతసేపు వున్నాడో వాడికే తెలియదు.

దూరంగా చింతబెత్తమాయన తిరిగి వస్తూ కనిపించాడు

యెంకటేశు గుండెలు గుబ గుబ లాడాయి. స్వరున పరుగెత్తి తాటాకుచ్చలా కొంపవుండు దాటి బయటపడ్డాడు.

హెడ్‌మాస్టరు పిలిచిందీ వాడికి విని పించలేదు, గేటుకాడ మీసాలసామీ అదిలించిందీ వాడికి తెలియలేదు. అంత వేగంగా పరుగెత్తు కెళ్లాడు.

గేటవతల పడ్డాకకూడా అలాగే కొంత దూరం పరుగెత్తుకొచ్చి—వెనక ఎవరూ తరుముకు రావడంలేదు ఫరవాలేదు అని అనుకున్నాక కాస్సేపు అక్కడే నిలబడి ఆయాసం తీర్చుకున్నాడు.

బడి ఎంత బాగుంటుంది ?

అందులో అడుగెడితేనే చాలు ప్రాణా నికి ఎంతో హాయి అనిపించింది. పంతులు గారు చెప్పేది వింటుంటేనా ? అబ్బ ... అంతకంటే ఆనంద మేముంది ? అంత కంటే అదృష్ట మేముంది ? ఏంలాభం? తనకా అదృష్టంలేదు. అదృష్టవంతు లైన పిల్లలు చదువుచెప్పించే యిళ్లలో పుడతారు లేనివాళ్లు లేనివాళ్లయిళ్లలో పుడతారు !

'సదువు మాటెత్తితే సాలు, అమ్మ గంగ యెర్రులెత్తినట్టు ఆడిపోసు కుంటాది. బాబు సరే సరి—సివాలెత్తు తాడు యింక సదువుకుంటానని యెవరితో సెప్పుకుంటాడు? తన బతుకింతే. తన బతుక్కి చదువులేదు. బడిలేదు గిడిలేదు ...శ్శ. .యెదవబతుకు...'

అనుకుంటూ దిగాలుగా పొలం చేరు కున్నాడు.

'వారేయ్ ... యెంకో...మి దూడలు రంగయ్యగారి ఆకుమడి సేలో పడ్డయ్యి. ఆయన అటిన్ని తోలుకెల్లి బందుల దొడ్లో యెట్టాడు...'

అన్నాడు సూరిగాడు కనిపించి.

'ఏడీ...ఆశంద్రిగా డెక్కడ...?'

అన్నాడు కంగారుగా యెంకటేశు.

శంద్రిగాడు నవ్వుకుంటూ ఎదుటి కొచ్చి నిలబడ్డాడు తక్కినవాళ్ల నందర్నీ పిలిచి —

'సూడండెహె...ఈడు బళ్లో కెల్లాడు సదుముకోడానికి...ఈడి దూడలు బందుల దొడ్లో కెల్లాయి తమాసా సూడ్డానికి...'

అన్నాడు నవ్వుతూనే. తక్కిన వాళ్లంతా చప్పట్లు కొడుతూ గొల్లున నవ్వారు.

యెంకటేశుకి ఏడుపు ముంచుకొచ్చింది. ఏడుస్తూ కూర్చున్నాడు. అందరూ పశువుల్ని యిళ్లకు తోలుకుపోయారు. యెంకటేశు మాత్రం కూర్చున్న బండ మీదనే కూర్చుండిపోయాడు.

ఇప్పుడెలా ?

'ఇంటికెల్తే బాబు సితక తన్నుతాడు.'

ఏం చెయ్యాలో పాలుపోక ఏడుస్తూ కూర్చున్నాడు.

అప్పటివరకూ చెదురు మదురుగా వున్న మేఘాలు దట్టంగా పేరుకోసాగాయి. చలి గాలి వీస్తోంది. చీకటి పడిపోయింది.

దిన్నగా చినుకులు కూడా ఆరంభ మయ్యాయి.

యెంకటేశు కదల్లేదు.

రాత్రయేకొద్దీ వర్షమూ ఎక్కు వయింది. యెంకటేశు బండమీదే తడుస్తూ ఏడుస్తున్నాడు.

దూరంగా ఒక గుడ్డిదీపం కనిపించింది.

ఇంత రాత్రివేళ ఇంత జడివానలో తన వైపు ఎవరొస్తారు? ఇంకెవరు? బాబే! సంశయం లేదు.

ఇంకోసారయితే నర్సిగాణ్ని చూసి భయంతో పరుగెత్తేవాడే కాని, ఇప్పుడా వోపిక లేదు.

ఆకలయి పేగులు తోడేస్తున్నాయి. కడుపులో ఎలకలు పరుగెడుతున్నట్టుగా వుంది. ఎంతో నిస్సారంగా వుంది. లేవ డానికి కూడా వోపిక లేదు.

దీపం దగ్గరయింది. ప్రక్కగా వొచ్చి నిలబడింది.

'యేరా...యేంటి నీ కత? దూడల్ని దొడ్లోకి తోలి...బళ్లోకి యెల్లావంటవే? నీకు సదువు కావాల్స వచ్చిందటరా... సవట నాగన్నా...'

అంటూ నర్సిగాడు చేతిలోవున్న దుడ్డు కర్ర తీసుకుని యెంకటేశు వీపు మీద వేశాడు.

'కుంయ్యో' మన్నాడు దెబ్బ పడగనే యెంకటేశు. పరుగెత్తే వోపిక లేదు.

నజ్జు నజ్జుగా నానిపోయిన యెంకటేశు

# చదువు

నర్సిగాడి కాళ్లని గట్టిగా పట్టుకుని 'బాదుకో'మన్నట్టు వీపు ఒగ్గేశాడు.

దారి పొడుగునా బాదుకుంటూ యింటికి తీసుకొచ్చాడు నర్సిగాడు. అంతతో సరి పెట్టకుండా లచ్చి కూడా నాలుగు తిని పించింది.

'సచ్చినోడికి ఈ యేల కూడెట్టకు' హుకుం జారీ చేశాడు నర్సిగాడు.

నర్సిగాడు చెప్పకపోయినా యెంకటే శుకు కూడు పెట్టేది కాదు లచ్చి. ఆమెకీ కోపంగానే వుంది.

వర్షం జోరు ఎక్కువయింది. వర్షంతో పాటు గాలి, రెండూ విపరీతంగా విజృం భించాయి. గాలికి యింటి మీద కప్పు ఎగిరిపోయి వర్షం కురవ నారంభించింది. యెంకటేశు మూలుగును మింగేసే వురుములు !

తెల్లారింది.

మామూలుగా కాదు. తుఫాను పెడ బొబ్బల మంగళరావాలతో, హోరున వర్షం అక్షంతలు జల్లుతుండగా తెల్లా రింది.

వర్షం నీళ్లు రోడ్ల మీద కాలువల్లా ప్రవహిస్తున్నాయి.

అంత వానలోనూ హడావిడిగా వెళ్తున్న హెడ్మాస్టరు నర్సిగాడి యింటిముందాగి,

'నర్సి ...' అని పిలిచారు.

ఆ కేక విన్న యెంకటేశు తడిక కన్నంలోనుంచి చూశాడు.

ఇంకేముంది! చింత బెత్తమాయన!

'దొంగతనంగా బళ్లోకి యెల్లినందుకు బాబుతో సెబుతారు కామోలు! మళ్లీ దెబ్బలు...ఎలా ?'

అనుకుంటూ బలాన్ని కూడదీసుకుని లచ్చికి కూడా కనిపించకుండా నెమ్మదిగా బయటికి వచ్చేశాడు.

హెడ్మాస్టరు పిలవగానే నర్సిగాడు బయటికొచ్చి చేతులు కట్టుకుని నిల బడ్డాడు.

'గాలివాన ఎక్కువయేలా వుంది. మన మంతా వూరు ఖాళీచేసి పట్నం పోవాలని పైనుంచి వార్త వచ్చింది. నీళ్లు వూరంతా చుట్టేశాయి. అప్పుడే బడి ఒక పక్కంతా కూలిపోయాయి. వెంటనే కదలండి.'

అంటూ సాగిపోతూ మళ్లీ ఏమి గుర్తొచ్చిందో ఏమో, వెనక్కి వచ్చారు. వచ్చి—

'నర్సిగా...యెంకటేశు నీ కొడుకేగా?' అనడిగారు.

'అవును బాబయ్యా... ఏమన్నా పాడు పని చేసిడేంటి...సొంపండి మక్కె ఇరగ తంతాను...' అన్నాడు వినయంగా.

'అబ్బే...లేదు. కుర్రాడికి చదువంటె చాల ఆసక్తిగా వున్నట్టుంది. స్కూల్లో చేర్పించరాదూ ?'

అన్నారాయన.

'సదువా...సట్టుబండలా ? గొడ్లని కాయడం సాతకాని యెదవకి సదువే మొత్తాది పంతులుగోరూ ... సేతికం దొచ్చాడు. వచ్చేయేడు మీలాంటి మీలాంటో ళ్ళిళ్లల్లో గొడ్లకాడెడదామనుకుంటున్నాను.' అన్నాడు నర్సిగాడు.

'సరే నీ యిష్టం... మీరు మాత్రం వెంటనే బయల్దేరండి...'

అంటూ హడావిడిగా వెళ్లిపోయారు హెడ్మాస్టరు.

గాలి వాన ఉధృతం అంత కంతకు ఎక్కువవుతోంది. రోడ్లమీద నీటిమట్టం పెరుగుతోంది. అంతకంతకు రోడ్లెక్కడున్నాయో అని వెతుక్కోవలసిన పని పడుతోంది. ఊరు వూరంతా ఒకటే గగ్గోలుగా వుంది. పట్నం పోవడానికి ఎవరినట్లుకు వాళ్లు తొందరపడిపోతు



న్నారు.

'ఇంట్లో యెంకటేశు లేడు...' అంది అచ్చి.

'వుంటాడులే యెక్కడికి పోతాడు? ఆడే వత్తాడు...' అన్నాడు మొండి ధైర్యంతో నర్సిగాడు గుడ్డల మూటలో పొగాకుకట్ట వేసుకుంటూ.

లోలోపల గుబులుగావున్నా ప్రయాణం హడావిడిలో ఆ కాస్సేపూ యెంకటేశుని మరచిపోయింది అచ్చి.

ఊరు పూరంతా బారులుగా నీటి కాలువల్లావున్న రోడ్లమీద సామాన్లతో నడిచిపోతున్నారు

పిడుగులూ, పెడబొబ్బలూ మిన్నుముట్టుతున్నాయి. తమ తమ పూరిపాకలు నేల మట్టమై నీళ్లల్లో తేలిపోవడం కళ్లారా చూస్తున్న ఆ జనం పడుతున్న బాధ హృదయవిదారకంగా వుంది.

* * *

యెంకటేశు హెడ్‌మాస్టారి భయంతోను, అమ్మా బాబుల భయంతోను ఎటూ తోచక బడి కాంపవుండుదాకా పరుగెత్తుకొచ్చాడు.

ఒకసారి వెనుతిరిగి చూసి తనని అనుసరిస్తున్నవాళ్లు ఎవళ్లూ లేరని నిశ్చయించుకున్నాక కొంచెం ధైర్యం తెచ్చుకున్నాడు.

# చదువు

తర్వాత కనిపించింది.

నిర్మానుష్యమైన బడిగేటు. అప్పటికే లోపలికి నీరు ప్రవహించింది. ఆ ప్రవాహ వేగానికి తెరచివున్న తలుపులు వెనక్కీ ముందుకీ వూగుతున్నాయి.

అవి తనని లోపలికి ఆహ్వానిస్తున్నట్టుగా భావించాడు యెంకటేశు.

'బడి కూడా అమ్మలాంటిదే ..'

అన్న పంతులుగారి మాటలు జ్ఞాపకం వచ్చాయి. అంతులేని ధైర్యమొచ్చింది. జన సంచారం కూడా లేకపోవడంతోనూ, తనని అడ్డుపెట్టేవాళ్లు ఇప్పుడు లేరనే సంతోషంతోనూ లోపలికి వెళ్లిపోయాడు. ఇష్టారాజ్యంగా అంతా కలియ తిరిగేశాడు.

తనే బడి పిల్లాడుగాను, తనే మాస్టారిగాను, తనే హెడ్‌మాస్టారుగాను, తనే గేటుని కాపలా కాసే మీసాలసామి లాగాను స్వేచ్ఛగా విహరించాడు. తెరచి వున్న గదులన్నింటిలోనూ తనివితీరా పచార్లు చేశాడు. అసలైన స్కూలు పిల్లాడిలా ఠీవిగా తిరిగాడు.

అమ్మదగ్గరున్నప్పటి కంటే ఇప్పుడే, బడిలో వున్నప్పుడే తనకి ఎక్కువ సంతోషంగా వుంది. ఆకలిదప్పుల్ని కూడా మరిచి పోగల్గాడు.

'అవును బడి అమ్మకంటే గొప్పది'

అనుకున్నాడు మళ్లీ ఒకసారి మనసారా.

అమ్మ వొడి ఎంత వెచ్చగా వుంటుందో—ఎంత హాయిగా వుంటుందో యెంకటేశుకి తెలియదు. కాని పాఠశాల వడి మాత్రం — అంతటి భీకర వాతావరణంలోనూ వాడికి ఎంతో హాయి కూర్చింది.

అంతక్రితం తను చూసిన గదిలోకి వెళ్లాడు. అక్కడ బెంచీలన్నీ పిల్లల్లేక దిగాలుపడి వున్నట్టనిపించాయి.

ఉత్సాహంగా వెళ్లి ఒక బెంచీమీద కూర్చోగానే వాళ్లంతా తేలిపోయినట్టనిపించింది. ఎన్నడూలేని ఆనందాన్ని అనుభవిస్తున్నాడు. కాని అనుభవించే వోపిక మాత్రం యెంకటేశు వొంట్లో లేదు. మగతగా వుంది. కళ్లు మూసుకుపోతున్నాయి. ఎదురుగా వున్న డెస్కు మీదకి వొరిగి పోయాడు.

పంతులుగారు పాఠం చెబుతున్నట్టు, తనూ విద్యార్థులతో కలిసి చదువుకుంటున్నట్టు తియ్యని కల వచ్చింది. పంతులుగారు పాఠం చెబుతూ, చెబుతూ మధ్యలో ప్రశ్నలు వేస్తున్నారు. తను చకచకా సమాధానాలు చెప్పేస్తున్నాడు. పంతులుగారు ఎంతో మెచ్చుకుంటున్నారు. పరీక్షలు పాసు చేసేస్తున్నారు. తను అంతకంతకు పెద్ద పెద్ద చదువులు చదివేస్తున్నాడు.

తను? పూర్తిగా మారిపోయాడు. అందరి పిల్లలకంటె తెల్లనిబట్ట లేసుకుంటున్నాడు. పుస్తకాలసంచీ భుజానికి



తగిలించుకుని అందరి పిల్లల్తోపాటు ఆడుతూ పాడుతూ రోజూ బళ్ళోకి వెళ్తున్నాడు. తను చదువుకుంటున్నాడు

'నేను చదువుకుంటున్నాను ...

నేను చదువుకుంటున్నాను ...

నేను చదువుకుంటున్నాను...'

అని కలవరిస్తుండగా వాడికాళ్ళకిందకి నీళ్ళువచ్చి మెలకువ రప్పించాయి.

కళ్ళు నులుముకు చూశాడు.

అంతా కల!

క్రిందన్నీ నీళ్ళు. నీళ్ళు బడిలోపలికంటూ వచ్చేస్తున్నాయి.

లేచాడు. వెంటనే వరండాలో కొచ్చి చూశాడు. చుట్టూ గంగాప్రవాహంలా వుంది.

ఆ నీళ్ళుచూసి యెంకటేశు భయపడలేదు. ఎక్కడలేని వుత్సాహం వచ్చేసింది. కాళ్ళతో నీళ్ళని ఈదుకుంటూ గంతులు వేయసాగాడు...కేరింతలు కొట్టసాగాడు.

హఠాత్తుగా దభిల్లుమన్న శబ్దం వినిపించింది. ఆ శబ్దానికి భూమంతా అదిరినట్టయింది. స్తంభాన్ని గట్టిగా కావలించుకున్నాడు కళ్ళు మూసుకుని తెరిచేంతలో బడి ఒకప్రక్క వారిగిపోయింది.

బడి కూలిపోతోంది!

అంటే! ఇక్కడికి పిల్లలు రారన్న మాట! పంతుళ్ళూరారు! మరి చదువుకునేదెలా? ఇప్పుడు యెంకటేశుకి ఎక్కడలేని భయం పుట్టుకొచ్చింది

'కూలిపోకూడదు, బడి కూలిపోకూడదు...'

అనుకుంటూ ఆ స్తంభాన్నే మరింత గట్టిగా పట్టుకున్నాడు.

వానకు తడిసిన పెండెం కొంచెం కిందికి దిగజారింది. దాంతోపాటు దానికి కట్టిన గంట గణగణలాడింది గంటని చూశాడు యెంకటేశు గంట చేతికందేలా వుంది.

మెరిసిన మెరుపుకు లోకమంతా తెల్లవయింది. అలాంటి ఆలోచనే యెంకటేశుకి స్ఫురించింది!

గంటకొడితే వూళ్ళో జనమంతా వస్తారు. వచ్చి బడిని కాపాడతారు! బడి అమ్మని రక్షిస్తారు!

బడి పడిపోకూడదు!

బళ్ళో పిల్లలు చదువుకోవాలి!

—అనుకుంటూ గంటని అదేపనిగా మోగించడం మొదలుపెట్టాడు.

యెంకటేశు కోసం వెదికి వెదికి నిరాశ చేసుకుని గంపెడు దుఃఖంతో నీటిలో ఈదుకుంటూ వెళ్తున్న నర్సిగాడికి బడి గంట వినిపించింది.

'యెంకా...! యెంకటేశా...!!

అని గట్టిగా అరిచాడు.

గొంతు పెగుల్చుకుని అరిచాడు.

అతని అరుపులు బడి గంటల్లో కలిసిపోతున్నాయి.

ప్రవాహానికి ఎదురీదుతూ బడిని చేరుకోవాలని విశ్వప్రయత్నం చేస్తున్నాడు నర్సిగాడు. ఎంతో శ్రమపడి గేటుదాకా రాగలిగాడు. వడిగా సుళ్ళు తిరుగుతూ వస్తున్న ప్రవాహం నర్సిగాడిని విసిరికొట్టింది. నర్సిగాడు అమడ దూరంలో కొట్టుకు పోయాడు.

ఎదురీత ఈదే నర్సిగాడికి గంటలు నెమ్మది నెమ్మదిగా వినిపిస్తున్నాయి. నర్సిగాడు చూస్తుండగానే అంతా అయిపోయింది. బడి పూర్తిగా కూలిపోతున్న భయంకర దృశ్యం అతని కంటబడింది. కూలినేల మట్టమై నీటిలో కలిసిపోవడం కళ్ళారా చూశాడు.

గంటలు ఆగిపోయాయి...కాని, శబ్దం వినిపిస్తూనే వుంది. నర్సిగాడి చెవుల్లో గింగురుమంటూనే వుంది. 'చదువో చదువో' అని గగ్గోలపెడుతున్న ఆ శబ్దం నర్సిగాడ్ని పిచ్చివాడ్ని చేస్తోంది.

ఫెళఫెళా వురుములు!

తళతళా మెరుపులు!

ఆ కాంతిలో నర్సిగాడి కళ్ళు చూడలేక పోయాయి. అంత పెద్ద కాంతిని నర్సిగాడికున్న చిన్న కనురంధ్రాలేమి చూడగల్గుతాయి?

కళ్ళు చూడలేని ఆ కాంతి ఎందుకు? కాల్చనా? ●





# వారఫలం

## 12-6-1970 శుక్రవారం మొదలు 18-6-1970 గురువారం వరకు

**మేషం** వృత్తిలో శ్రమ మీద అనుకూలత లభిస్తుంది. ప్రయాణాలు వాయిదా పడతాయి. పోటీవారిలో గౌరవం లభించగలదు. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. వారం ఆఖరులో లాభం రావలసిన వ్యవహారాల వేనష్టం రావచ్చును.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. దైవకార్యాలు నెరవేరతాయి.

**వృషభం:** వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. వృత్తిలో పోటీవారితో పోటీ పెరుగుతుంది. రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. అన్నివ్యవహారాల్లోను వారం ఆఖరులో మీ శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

**మిధునం:** ఇతరుల నిమిత్తం చేసే ప్రయత్నాలు సులువుగా నెరవేరుతాయి. పోటీవారిలో గౌరవం లభిస్తుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు. వృత్తిలో ఆదాయం బాగా ఉంటుంది. రావలసిన డబ్బు మీద ఆధారపడి యే వ్యవహారమూ ప్రారంభించడం తగదు.

స్త్రీలకు—బంధుమిత్రులను కల్సుకొంటారు. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**కర్కాటకం.** వ్యాపారంలో అనుకూల వార్తలను వింటారు. మిత్రులకు సహాయం చేస్తారు. స్థిరాస్థి వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. విద్యావైజ్ఞానికరంగాల్లో మీ కృషి రాణిస్తుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**సింహం:** వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగా ఉంటాయి. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరుతాయి. కొన్ని వ్యవహారాల్లో మీ మంచితనమే మీకు యిబ్బందిని కలిగిస్తుంది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. సంతోషకరమైన వార్తలను వింటారు.

**కన్య:** మీ చాకచక్యమే అన్నివ్యవహారాల్లోను అనుకూలతను సాధించగలదు. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. విద్యావైజ్ఞానికరంగాల్లో మీ కృషి రాణిస్తుంది. రాజకీయ వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. శుభకార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

**తుల:** లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును. మీ తాలూకు వస్తువులు పోయే ప్రమాదం ఉంది. వారంమధ్యలో వృత్తిలో ఆదాయం బాగా ఉంటుంది. ఉద్యోగంలో గౌరవం లభించగలదు. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాల బాగా ఉంటాయి.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. అధికవ్యయం జరుగుతుంది.

**వృశ్చికం:** వృత్తివ్యాపారాల్లో మీ కార్యక్రమాలు బాగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. వారంమధ్యలో ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. వారం ఆఖరులో తిరిగి అన్ని వ్యవహారాల అనుకూలంగా ఉంటాయి

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉండదు. సాహిత్యకళారంగాల్లో మీ కృషి రాణిస్తుంది.

**ధనుస్సు:** వ్యాపారంలో ప్రయోజనం గల సంభాషణలను జరుపగలరు. పోటీవారిలో గౌరవం బాగా ఉంటుంది. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. ఆర్థిక వ్యవహారాల అనుకూలంగా ఉంటాయి. వారం ఆఖరులో మీరు అనవసరమైన శ్రమకు గురి కాగలరు

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల కార్యభారం పెరుగుతుంది. పుణ్యకార్యాల చేస్తారు.

**మకరం:** అన్ని వ్యవహారాల అనుకొన్నట్లుగా నెరవేరతాయి. ప్రయాణాలు ఫలిస్తాయి. స్థిరాస్థి వ్యవహారాల బాగా ఉంటాయి. బంధువులకు సహాయం చేస్తారు. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కుంభం.** నమ్మిన వారివల్ల యిబ్బందులకు గురి కాగలరు. ఆందోళన కలుగుతుంది. వారంమధ్యలో వృత్తి వ్యాపారాలు బాగా ఉంటాయి. విద్యావైజ్ఞానికరంగాల్లో మీ కృషి రాణిస్తుంది. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగా ఉంటాయి.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. సంతోషకరమైన వార్తలను వింటారు.

**మీనం:** ప్రయత్నించిన ప్రతి పనీ సులువుగా నెరవేరుతుంది. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. వారంమధ్యలో అధికవ్యయం జరుగుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారం ఆఖరులో తిరిగి అనుకూల పరిస్థితుల యేర్పడతాయి.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉండదు. బంధుమిత్రులను కల్సుకొంటారు.

—మహేష్

# ప్రశ్నార్థం

...కె. రామలక్ష్మి...

**టి ఎల్. కె ఆర్, బొంబాయి.**

ఈ మధ్య అప్పారావు, తుకారాం, విసినాథం, సీత, సుబ్బులు కనపట్టంలేదు. కారణం ?

ముళ్ళపూడి బొత్తిగా బాలరాజు కొలువులో తల మునకలయిపోవడమే.

**కన్నయ్య వరంగల్లు.**

నాకు కథలు వ్రాయాలని ఉంది. రాత్రులు ఆలోచించిన కథను మనస్సులో తయారు చేస్తా. ఉదయం రాయాలని అనుకుంటాను. తీరా కలం పట్టే సరికి ఏ విధంగా మొదలుపెట్టాలో తెలియక కథ రాయడమే విరమించుకుంటాను. రాత్రులే రాయడం మొదలుపెట్ట మంటారా ?

పన్ను పగలకొట్టుకుందుకేరాయి అయితేనేం ? కథ రాయడానికి రాత్రయితేనేం? పగలైతేనేం?— రాత్రేరాయండి సార్.

**ఎస్. వి ఆర్, కొల్లాపూరు**

మీరు త్రాగుతారా ? (కొందరు తెలుగు రచయిత్రులు మద్యం సేవిస్తారన్న నిజం తెలిసి ఈ ప్రశ్న)

చిత్తం. ఇంకా లేదు— అంత నిషా కావలసిన రచనలు చేయడం నాతరం కాదు.

కవిత్వాన్ని అంతగా స్త్రీలు ఆరాధించక పోవడానికి కారణం?

కొన్ని కొరకబడక పోవడం, మరికొన్ని మరీ నేల బారుగా ఉండడం.

**ఐ. ఎల్. పి, సత్యవోలు**

కథలు రాసేవారు పుల్‌స్టాపులు కామాలు వారే రాసి పెట్టాలా ? కథ రచించేటప్పుడు — వారికి సంపాదకులు తెలియ చేస్తారా ?

పోనీ వో కేజీ, అదా ఎక్కువ ఉంటే మీరే పెట్టేయండి సార్, సంపాదకులకెందుకా ఛాన్సు వదలడం!

**ఎన్. ఎమ్. ఆర్, చిత్తూరు**

నిజం నిప్పులాంటిది. అబద్ధం ఏనాటికైనా బయటపడుతుంది అంటారు. ఈ రోజుల్లో నిజం అడుగంటి అబద్ధమే జయం సాధిస్తూంది.

నిజం అప్పటికప్పుడు కాలుస్తుంది. అబద్ధం అయితే నెమ్మదిగా రాజుకుని బయటపడుతుంది. .. మరీ అంత బుస్సున మండేలా నిజం చెప్తే దండుగ.

**ఆడారి(!)మునగపాక**

జీవమున్న మనిషికన్న శిలలే నయమంటారు కొందరు. కారణం ?

కారణం ఏమిటి ఆడారీ ! అవి బదులు పలుకవు కదా?!

**కె. ఎస్. ఎన్, తిరుమల**

ప్రతి మానవుడు సమాజాలను గౌరవించాలా ? లేక సమాజాలే ప్రతి మానువుణ్ణి గౌరవించాలా ?

ఇదేం ప్రశ్న బాబూ, ఎవరు స్థాపించుకున్న సమాజం వారిని గౌరవించదా?! [మనకెన్ని సమాజాలున్నాయి!]

**ఎస్, ఆర్. పి ఆర్, నల్లబపాయిపల్లె**

కవితాకన్య గుణములు కవికన్న రసజ్ఞుడెరుగు కవి యేమెరుగున్, భువిలో కన్యక గుణములు ధవుడెరుగునుగాని కన్నతండ్రే మెరుగున్?

అంతేమరి కన్య కూడా కవిత లాంటిదే. రసజ్ఞుడైన భర్తే గ్రహిస్తాడామె గుణగణాలు.

**ఆర్. ఆర్. రావిపాడు**

ప్రేమికుల జంటలో ఒకరిని మంకరు మరిచిపోతే ఆ బాధ ఎటువంటిదంటారు?

విడిపోయాక, మరచిపోయాక అంటున్నారు— ఇంక వారు ప్రేమజంటెలా అవుతారండీ?

**పి. వి. ఎమ్. ఆర్, మునగపాక**

మానవుడు జీవితాంతం ప్రశాంతంగా గడపాలంటే ఏమిచేయాలి?

కందమూలాలు తింటూ వనాల్లోకి పోయి తపస్సు చేసుకోవాలి. [కర్మ! కందమూలాలు వెతుక్కోవాలి కాబోలు, అవి తింటే మనిషికి కావలసిన అవసరాలన్నీ ఏర్పడతాయి కాబోలు, ఇంక అవన్నీ వస్తే తిరిగి 'కాపీన సంరక్షణార్థం' అన్నట్టు సరిపి సంతానం ఏర్పడబోతాయి కాబోలు! ఎలా?]

**జె. యం. యు, కొత్తగూడెం**

ఏమండీ స్త్రీ ప్రతి ఒక మానవునికి మందులు మాకులు పెట్టుచున్నారు, కారణం ఏమిటి?

అలాగా? ఆ మందులూ మాకులు ఏమిటో కొంచెం చెప్పండి —ప్లీజు కొంచెం పనుంది!

**సి. ఎల్. ఎన్, హైద్రాబాదు**

మీ లేడీ నవలిస్టుల వ్యాసంలో వర్ధిష్ణు రచయిత్రి బీనాదేవిని గూర్చి ప్రస్తావించక పోవడం శోచనీయం.

లేదు. 'బీనాదేవి'ని శుద్ధ ఆడ రచయితగా జమ కట్టే సాహసం నాకు లేదు. అంతే.

**ఎస్. పి. ఆర్, తాడిపత్రి**

...మాతమ్మునికి ఐదు సంవత్సరాలలో ఎడమకాలు పదకొండో ఏట కుడికాలు పడి పోయాయి...నయం కాలేదు.

వీరింకా అశ్రద్ధ చేయకుండా మద్రాసులో ఉన్న 'ఆర్థోపెడిక్ సెంటర్' వారితో సంప్రదించి అబ్బాయిని తీసుకువచ్చి చూపించండి. . . . మన కళ్ళని మనమే నమ్మనంతగా ఇక్కడ ఇటువంటి వికలాంగులకి చికిత్స చేస్తున్నారు. భూరి విరాళం యిచ్చి ఈ సంస్థని స్థాపించి దాన్ని దినదిన ప్రవర్ధమానం చేస్తూ దేశమే సర్వస్వంగా భావించే శ్రీమతి లక్ష్మీపార్వతిగారు— సాటిలేని సంఘసేవిక.

**ఎ. ఎస్. ఎన్, బళ్లారి**

రామలక్ష్మిగారూ కాలేజీలకు వెళ్ళే ఆడపిల్లలు అంత పిచ్చిగా ఫాషన్ చేసుకుంటారు కదా? వాళ్లని ఎవరు హద్దులో పెట్టాలి? తల్లి తండ్రులా? రోడ్డువార రోమియోలా?

అందంగా అలంకరించుకోవడం ఆడపిల్లల జన్మహక్కు. వేలంవెర్రిగా ఒకొక్కప్పుడు ఒకొక్కటి ఫాషనవుతుంది. తిరిగి సమసిపోతుంది. దీన్ని పట్టుకుని వీళ్ళకెవరు బుద్ధి చెప్పాలి? అంటూ కత్తుల్లు నూరటం-పనిలేనివాళ్ళు చేసే పని అని నా ఉద్దేశ్యం.

**ఎమ్. ఎమ్. ఆర్, లోవర్ సిగిలేరు ప్రాజెక్టు**

కోరుకునేది లభించి కూడా అవకాశము లేక అనుభవించకపోవడం _ అసమర్థతే అంటారా?

దూరదృష్టి కూడా కావచ్చు.

**బి. హెచ్. ఎస్, కోవెలకుంట్ల**

వెన్నపూసలాంటి మనసుగల భర్యను విడిచి పరస్త్రీతో ఉండుట ధర్మమా? అధర్మమా?

మెతకమనిషి ఇష్టంలేక పరాయి స్త్రీ పంచ చేరినంతవరకూ చేరిన వారి ధర్మం, కట్టుకున్న భార్యను వదిలేయడం ఆమెగారి పట్ల అధర్మమే మరి!

# ఒక వారం విపరీతం ఫాలాక్షుడు

## ముద్దు ముద్దాయిలు

ఆ ముద్దు అంటే తెలుసా.. మాన్‌ఛెస్టర్ జైలులో వున్న తన ప్రియుణ్ణి చూడవచ్చిన జానెట్ హార్ట్‌మన్ అనే ఆమె అతనికో గాఢమైన ముద్దు ప్రసాదించిందట. ముద్దు కోసం కలుసుకున్న రెండు రెళ్ళు నాలుగు పెదిమలు విడడానికి చాలా సేపు పట్టిందట. ఈ ముద్దులోని మర్మం, చెపుతూ కోర్టులో ఒక లాయరుగారు 'ఈ ముద్దు ద్వారా ఆమె తన ప్రియునికి గంజాయి అంద జేస్తోందని, ముద్దు పెడిన ఆమె నోట్లోంచి అతని నోట్లోకి ఆ మత్తు పదార్థం రవాణా అవుతోంద'ని వెల్లడించారట—హారిహారీ—యుమ్మార్

అబ్బ! ఎంత గాఢ మైన ముద్దో!!!

తాంబూలాల మార్పిడి లాగ.. ఈ ముద్దు అనంతరం ఆమె ప్రియుడు రూమ్మని వో మూలకు వెళ్ళి నోట్లోని పదార్థం తీసి కాగితాలతో సిగరెట్‌లా చుడుతూ చట్టానికి పట్టుబడ్డాడట. ఈ ముద్దు ముద్దాయిలను అక్కడి చట్టం పట్టుకుని విచారిస్తోంది.

## లాయరుగారి మూర్ఛ

మియామిలో ఆకాశంలో ఎగరాల్సిన విమానం ఒకటి ప్రమాదవశాత్తూ గతి తప్పి, రూమ్మని భూమ్మీదున్న వో పెయింటరు షాపులోకి దూసుకు పోయి, అక్కడ తగులబడి పోయిందట. ఆ సమయంలో వున్న షాపు యజమాని 15 ఏళ్ళ కొడుకును కూడా పొట్టన పెట్టుకుందట. తన కొడుకు మరణానికి కారణమైన ఆ సంస్థ మీద కేసు పెట్టి, ఆ తండ్రి ఆ కేసును జె. బి. స్పెన్స్ అనే లాయరు చేతిలో పెడుతూ వచ్చిన డబ్బులో సగం ఇస్తానన్నాడట. తీరా మోసి కేసు గెలిచి, ఆ కుర్రాడి తండ్రికి 1.8 మిలియను [1.35 కోట్ల రూపాయలు] వచ్చేసరికి తన వాటా తల్చుకుని లాయరుగారు అక్కడికక్కడే నిండు కోర్టులో మూర్ఛపడిపోయారట— టేకిట్ సీరియస్— జోకు కాదిది నిజమే!

## టాంకులో శిశు హత్య

ఢిల్లీలో 25 ఏళ్ళ పిస్తామోలాల్ తన భార్య, 3 ఏళ్ళ పిల్లతో అన్నగారి ఇంట్లో వుండేవాడట. అన్నగారి భార్యతో పోట్లాడి, అలిగి అతని భార్య పుట్టింటికి వెళ్ళిపోయి, ఇక తిరిగి రానని చెప్తూ తన పసిపిల్లను కూడా భర్తకే అట్టే పెట్టేసిందట. ఈ దాబుణాన్ని, పసిపిల్లనూ భరించలేని పిస్తామోలాల్ ఆ పిల్లను వో నీటి టాంకులో పడేసి, శిశు హంతకుడై చట్టానికి పట్టుపడ్డాడట.

## తగాదా చావు

ఢిల్లీలో పోయిన 17 వ తేది 60 ఏళ్ళ రాధా దేవి అనే ఆమెకు, ఆమె కొడుకు 35 ఏళ్ళ కృష్ణ లాల్‌కూ డబ్బు విషయంలో తగాదా వచ్చిందట. పొలం అమ్మి చేసుకున్న డబ్బును తన కివ్వమంటే ఇవ్వనన్న తల్లిని అతడు చంపేశాడట. రోజులా రాధాదేవి వేళకు వచ్చి తనతో కబురు చెప్పలేదేమిటాని అనుమాన పడిన ఇరుగూ పొరుగూ పోలీసులకు తెలియజేస్తే వాళ్ళొచ్చి కూపీలు లాగారుట.

## విద్యార్థినుల గర్భస్రావాలు

ప్రపంచంలో కల్లా గర్భస్రావాలు ఎక్కువగా జరుగుతున్న దేశం అని పేరెక్కిన బ్రిటనులో 16 ఏళ్ళ లోపు స్కూలు విద్యార్థినులు చేయించుకునే గర్భస్రావాలు హీనపక్షంగా ఎంత లేదన్నా రోజుకో నాలుగు వుంటాయట. సాలునా 60 వేల గర్భస్రావాలు జరుగుతున్నాయట. 1968 నుంచి యీ చట్టం అక్కడ అమలుకు వచ్చిందట— ఈ గర్భస్రావాల చట్టం కిమర్థం—అనర్థం.

## విద్యుత్ నీతి

తొక్కియం అనే వూళ్ళో వానకి భరించలేని వో లాంతరు స్తంభం తన అసమర్థతను ఒప్పుకుని వ్రేలాడిపోయిందట. దాన్ని ఆధారం చేసుకున్న తీగెలు కూడా నేలబారుకు వచ్చేశాయట. అది చూడకుండా వానలో తడుస్తున్న గేదెను పాడి జాగాలో కట్టేద్దామని వెళ్ళిన మాణిక్యం ఆ తీగ మీద కాలు వేసి, కెవ్వున కేకవేసి పడి, చనిపోయాడట. పొలం పని చూసుకు భార్యతో సహా వస్తున్న కొత్తల్లుడు ఆ తీగ తొక్కి వో పొలికేక వేసి, పుడమి పట్టుకుని పడి చనిపోయాడట. బెంగుళూరులో యలహంక అనే వోట లాంతరు స్తంభాన్ని ముట్టుకున్న నేరానికి గంగమూలా అనే యువకుడు అక్కడికక్కడే చనిపోయాడట. ఆరణి కరెంటు శాఖలో పని చేస్తున్న 35 ఏళ్ళ బాలకృష్ణన్ అనే వ్యక్తి వో లాంతరు స్తంభం మీద ఎక్కి తన వృత్తి ధర్మాన్ని నిర్వర్తిస్తూ షాకు తగిలి అక్కణ్ణుంచి కెవ్వున పడి, చనిపోయాడట—నీతి : నా బంగారం పుట్టలో వేలు పెడితే నే కుట్టనా అని గండు చీమ పలికెను.

## కారొస్తున్నాయ్ జాగ్రత్త

డ్రయివరు కారెక్కి స్టార్టు చేసిన వెంటనే [డ్రయివరే కాదు—ఎవరైనా] ఆ డ్రయివరు ఒక వేళ తాగితే ఆ సంగతి ఆ కారు కనిపెట్టి మిగతా కారు వాళ్ళకి చెప్పేస్తుందట. ఈ కొత్త పద్ధతి సదరు అమెరికావారు కనుక్కున్నారుట. కారెక్కి ఇంజను తాళం తిప్పగానే డాష్ బోర్డు మీద వో అయిదంకెలు వస్తాయట. వాటిని కమపద్ధతిలో



మిషను పెట్టి కూడితేనే గాని కదుల్తుందట. లేకపోతే అది గాడిదలా ఓండ్ర పెట్టి మిగతా కార్లవారికి 'మా డ్రయివరు తాగి కూర్చున్నాడోయ్' అని సిగ్నల్ యిస్తుందట — బెస్టు.. ఇలాటి కాంట్రాప్షన్స్ యింక విస్తారంగా, సుబ్బరంగా తాగే యువత్వు..వైనాట్.

## కోర్టులో హత్య?

వాడెవడో ఎవర్నో కాజేస్తే
— మధ్యే మా కెందుకండీ
ఇంత భయం?!



మైసూరు రాష్ట్రానికి చెందిన దండేలికి చెందిన ఓ ముగ్గురు వ్యక్తులు కంట్రాక్టర మీద కేసొకటి హలియాలో జరుగుతోందట. పుట్టస్వామి అనే సాక్షి బోనులో ఎక్కి విషయం చెప్పబోతుండగా ముసుగు తొడిగిన ఆ ముగ్గురు కంట్రాక్టర్లలో ఒకడు రివ్వున వచ్చి నిండు కోర్టులో పుట్టస్వామి పొట్టలో కత్తి గుచ్చాడట. దాంతో అతనక్కడే నేలపైకి ఒరుక్కుని, టకటకాల్లోనే కూలి చనిపోయాడట. ఈ ఘోర దృశ్యం నుంచి తేరుకునేలోగా మరో వ్యక్తి గాండ్రిస్తూ తీసుకుంటూ లాయర్లనూ, జనాన్నీ తోసుకుంటూ కోర్టు మధ్యకు వచ్చి, గుర్రపు నాడా ఆకారంలో వుండే లాయర బల్ల మీద కెగిరి దూకి, గాయపర్చడానికి ప్రయత్నించాడట. అలాగా అతన్ని తరుముతున్న వారు అక్కడ అతన్ని పట్టుకుని హావమోది స్థిమితంగా వెళ్ళిపోయారట. జడ్జిగారు తన రూముకు చరచర వెళ్ళిపోతే, కోర్టులో వారంతా భయంతో పారిపోయారట.

## భరించలేని భర్త పోరు

వేలూరులో వెంకటేశన్ అనే అతని భార్య వెంకటలక్ష్మి తన భర్తతో నిత్యం పోరు భరించలేక, తన నలుగురి పిల్లల్లో, ఆఖరి పిల్లను తీసుకుని యిల్లు వదలి పక్కవూరుకు వెళ్ళి, అక్కడ గురుసామి అనే ఆయన పెరటి నూతిలో ఆపిల్లతో సహా దూకిందట. ఇద్దరూ చనిపోయారట.

## ఆరుగురు బిడ్డల కాన్పు

న్యూయార్క్‌లో ఓ లాయరుగారి భార్య మార్జరీ డానాఫ్ అనే ఆమె [25 ఏళ్ళు] ఒకే కాన్పులో ఐదుగురాడ పిల్లలను, ఒక మగపిల్లాడిని కన్నదట. అదేమంటే లోగడే తనకు మూడేళ్ళ కొడుకున్నందు వల్ల గర్భనిరోధక మాత్రలు కూడా వాడామానేసారి అంటట -- తత్ఫలితమా యిది! నాటీజా సైన్సు డాయింగ్— విహరిస్తూండుంటుంది.

## 135 ఏళ్ళ మనిషి

హిస్సార్ అనేచోట షేర్‌సింగ్ అనే ఆయన తన 135 వ ఏట మరణించారట. ఆయన శాఖాహారట. రోజూ మూడు కిలోల పాలు త్రాగేవాడట. జీవితంలో మొత్తం నాలుగుసార్లు వివాహం చేసుకున్నాడట. నాలుగో వివాహ ఫలితమైన కొడుక్కి యిప్పుడరవై యేళ్ళట [60]. ప్రస్తుతంలో సంతానాన్ని అధికంగా వద్దంటున్న ప్రభుత్వం ఆయనకా సంతానం అసలే వద్దనీ, ఆతరువాత ఇన్నేళ్ళకాలం బ్రతకకూడదనీ కూడా అనదన్న భరోసా యేమిటీ...ఏమో! ●




బేతాళుడు ఇలా అన్నాడు:— 'రాజా, మరెవరు నా సందేహాలు విచ్ఛేదం చేస్తారు? ఈ కథ విను.'

పూర్వం ఉజ్జయినీ నగరాన్ని చంద్రప్రభుడనే రాజు పాలించేవాడు. అతని ఆస్థానంలో దేవస్వామి అనే బ్రాహ్మణుడు ఉండేవాడు. అతడు చాలా ధనవంతుడు. అతనికి చంద్రస్వామి అనే కుమారుడు ఉండేవాడు. అతడు వేదాలకు సముద్రం. ఇంత గుణవంతునికి ద్యూతమనే వ్యసనం పట్టుకుంది. కళంకంలేని గుణాలు ఎక్కడ ఉంటాయి, నీవే చెప్పు.

అతడు జూదంలో చాల ధనం ఓడిపోయాడు. వృద్ధద్యూతకారులు అతనిని ఓడినధనం చెల్లించమని తీగలతో కట్టివేసి కొట్టేవారు. అతడు, ఏమీ మాట్లాడకుండా, మౌనంగా ఉండేవాడు. ఒకమారు ఇలాగే కొట్టగా, అతడు పలక్కుండా పడిపోయాడు. చచ్చిపోయాడనుకొని వాళ్ళు అతనిని వదలిపెట్టారు. అతడు ధనమూ లేక ఆరోగ్యమూ లేక బక్కచిక్కి అశేషక్లేశరాసులకు ఆశ్రయం అన్నట్టుగా గడుపుతూ, ఒకరాత్రి ఎక్కడికో వెళ్ళిపోయాడు.

అతనికి ఒక శూన్యదేవాలయం కనిపించింది. అతి కష్టంమీద ఆదేవాలయం చేరాడు. అక్కడ ఒక ఖట్వాంగవ్రతి కనిపించాడు. అతడు ఒళ్ళంతా భస్మం పూసుకొని వున్నాడు. ఆతపస్వి ఆకలితో నకనక లాడుతూ దీనుడైవున్న చంద్రస్వామిని చూచాడు. రమ్మని పిలిచాడు. తన విద్యతో బంగారు పట్టణం నిర్మించాడు. చంద్రస్వామిని ఆ పట్టణంలోకి వెళ్ళమన్నాడు.

చంద్రస్వామి ఆపట్టణంలో ప్రవేశించగానే, నూరు చందమామల కాంతితో వెలిగిపోయే బాలమృగాక్షులు అతనికి రాజోచితోపచారంచేసి. స్నానంచేయించి భోజనం పెట్టారు. తమ వడ్డాణాలు కదులుతూ అందంగా సవ్వడిచేస్తుండగా, దేవకాంతలు అతనికి ఆనందం కలిగించారు రాత్రి, తపస్వివిద్యతో ఇలాటి సుఖం అనుభవించాడు.

తెల్లవారింది. ఆ నగరం. సుందరులు, ఉపచారాలు మాయమయ్యాయి. దుఃఖం విపరీతంగా ముంచుకొని వచ్చింది. ఆమహావ్రతి అతనిపై దయదలచి ప్రతి రాత్రి ఇలాటి మాయకల్పించి అతనిని సంతోషపెట్టాడు. కాని, రాత్రి కనిపించేదంతా పగలు ఉండేదికాదు.

ఒకమారు ఆ విప్రుడు ఆ తపస్విని బాగా ఆదరించి ఇలా విన్నవించాడు: 'భగవన్, ఈప్సితార్థ సిద్ధికరమయిన ఈ విద్యను నాకు ప్రసాదించు.'

చంద్రస్వామి ఇలా ప్రార్థించగా, ఆ ఉదారాశయుడయిన ఆ తపస్వి ఇలా అన్నాడు: 'నాయనా, ఈ విద్య సులభమయింది కాదు. రాగాది బంధాలు తెంపుకొని తీవ్రనియమాలతో గాని సిద్ధించదు. నీటిలో ముఖం వరకు మునిగి జపాలు

చేయాలి: ఎన్నోవిఘ్నాలు కలుగుతాయి: నీవు నీటిలో ప్రవేశించగానే స్వప్నం కని పిస్తుంది — నీవు మళ్లీ పుట్టినట్టు. బంధుపుత్ర కళత్రాలు వున్నట్టు అప్పుడు, గట్టుమీదవున్న నేను నీకు జ్ఞాపకం కలిగిస్తాను. అప్పుడు నీవు నిప్పులో ప్రవేశించాలి. ఇంత జరిగిన మీదట నీకు విద్య లభిస్తుంది.'

తపస్వి ఇలాచెప్పి, తనవిద్యను అతనికి ఒకనదీ తీరలో ఉపదేశించాడు. చంద్ర స్వామి దానిని జపించడానికి నీటిలో ప్రవే శించాడు. అక్కడ అతనికి మరుపు వచ్చింది. తన్నుతానే మరచిపోయాడు. హిరణ్యపురిలో శంకరుడనే పురోహితునికి తను కుమారుడై పుట్టినట్టు, కల గన్నాడు. ఆ కలలో పురోహిత కుమా రుడుగా సకలవిద్యలు, కళలు గుణాలతో పాటు పెరిగాడు. పెళ్ళయింది: చాల విశ్వాస పాత్రురాలయిన శశిప్రభ అనే భార్య వచ్చింది. మంచి యౌవనం వసంత ఋతువుకు సంతోష కరమయిన విశ్రాంతి స్థలంవంటి ఉద్యానవనంలో మనోహరమయిన దేహం, లేడి కన్నులవంటి కన్నులుగల ఆ చంద్రప్రభతో విహరిం చాడు.

ఒకమారు, అతనిభార్య నూరారూ దాసీలతోపాటు వనంలో విహరిస్తూంది. దైవాత్తు ఆమెకు పాము కరచింది. ఆమె నేలమీద పడిపోయింది. ఆమెను చూచి కామం, ప్రీతి విషమించిపోగా, అతడు ఏడ్చాడు—హా ప్రియే! నామనస్సనే సముద్రానికి వెన్నెలవంటి దానా, చక్కని కన్నులదానా, సుందరీ, వినయరహితుణ్ని లక్ష్మి వదలిపెట్టి పోయినట్టు ఎక్క డికి వెళ్ళావు?

ఇలా డగ్గుత్తికతో ఏడుస్తున్న అతనికి ఒక దేవదూత ప్రత్యక్షమై 'కుమారా! నీ అర్ధం ఆయుస్సు ఆమెకు ఇచ్చావా, ఈమె బ్రతుకుతుంది' అన్నాడు.

విప్రుడు ఆమాటవిని, వెంటనే తన సగం ఆయుస్సు ఆమెకు ధారపోశాడు. ఆమె బతికింది. అప్పుడాతడు ఆమెను ఆలింగనం చేసుకుని ఆనందించాడు.

కొంతకాలానికి అతనికి కుమారుడు కలిగాడు. అచ్చంగతన ప్రతిబింబంలాగ వున్నాడు వాడు. కమలాలవంటి కన్నులు. సుందరుడు: స్నేహానికి మందిరం వంటి - అన్నిటినీ చూచాడు.
వాడు.
ఇంతలో గట్టుమీది తపస్వి అతనిని
ఇలా అతడు మాయావికల్పితంతా మేల్కొల్పాడు. వెంటనే అతనికి మెలకువ
పుట్టిన విద్యావిఘ్నకరాలయిన మాయ వచ్చి, స్వప్నంలాగ అంతా కరిగిపోయింది.

అతడు వహ్నిప్రవేశానికి ఉద్యమించాడు... అది వ్రతంలో రెండవ ఘట్టం.

కాని, తాను నిప్పులో ప్రవేశిస్తున్నానని బంధువులు దీనంగా ఏడ్చే ఏడుపులు అతనికి వినబడ్డాయి. చక్కని లేడికళ్ల తన ఇల్లాలు పిల్లవానిని ఒడిలో ఎత్తుకొని నిప్పులో దూకవద్దని నివారించింది. కాని, అతడు వినకుండా, వహ్నిలో ప్రవేశించాడు. కాని, తన భార్యకూడా తనతోపాటు సహగమనం చేయడం చూచి, ఆందోళనచెంది, 'హా! ఎంతటిపాపిని.' అని అనుకుంటూ, క్షణంసేపు కొయ్యబారిపోయాడు.

మంటలు అతనిని కాల్చలేదు. చంద్రుని లాగ చల్లగా అయాయి. (నదీజలంలో జపం చేస్తున్నవాడు, నీటినుంచి పైకి లేచాడు.

ఇదంతా పగటిలో నాల్గవవంతు కాలంలో చూచి, ఆశ్చర్యపడి, గట్టుమీది తపస్వికి అంజలిఘటించి జరిగిందంతా విన్నవించాడు.

ఆవ్రతికి చాల దుఃఖం కలిగింది. 'హా! ఎంతపని చేశావు! అంతా వికల్యమయి పోయింది. సిద్ధి నాశనమయి పోయింది. విద్య మరచిపోయింది.' అని ఆక్రోశించాడు.

చంద్రస్వామి వినయంతో 'తపస్వీ నేను నిర్వికల్పచిత్తంలో నీవు ఆదేశించిన ప్రకారం చేశాను. ఏ విఘ్నంవల్ల నన్ను మంటలు కాల్చలేదో, నాకు తెలియదు.' అంటూ ఆవ్రతి ఎదుట ప్రతిజ్ఞచేశాడు.

భ్రష్టవిద్యుడయిన ఆ తపస్వి దానికి కారణమేమిటా అని ఆలోచించాడు.

బేతాళుడు ఈకథచెప్పి రాజును ఇలా అడిగాడు: 'రాజన్, విధానమంతా సక్రమంగా జరిగింది కదా. ఎందుకు ఆ విద్య సిద్ధించలేదు?'

రాజు ఇలా సమాధాన మిచ్చాడు:— చంద్రస్వామి తపస్వి చెప్పిన ప్రకారమే చేశాడు. అయితే, అతనిమనస్సు బంధువులమీద మెత్తబడింది. అందువల్ల అతనికి విద్య సిద్ధించలేదు. అలా జరిగిందనే కోపంవల్ల గురువుకు చిరకాలంగా వున్న విద్యకూడ పోయింది భావం సరిగా లేనివారికి సిద్ధులు నశిస్తాయి.'

రాజు సమాధానంవిని బేతాళుడు వెంటనే ఎగిరి శింశుపావృక్షం చేరాడు. విక్రమసేనుడు ఉద్వేగం ఎంత మాత్రమూ చూపకుండా అతనిని మళ్లీ చెట్టుమీద నుంచి దింపాడు.

(ఇంకా ఉంది)










*freshness is a feeling*
*you can wear all day long*

*freshness is a fragrance*
*you can wear all day long*

*freshness is forbina*
*you can wear all day long*

Freshness is Forbina. Because Forbina is a deodorant as well as a talc. Checks excessive perspiration. Mildly antiseptic, Forbina prevents skin irritations, prickly heat and rashes. And it is gentle enough for the most tender skin.

CIBA Cosmetics



డాక్టర్ మహీధర నళినీమోహన్

# సరాసరి స్వర్గం నుంచి



[మొగుడికి ఏ విదేశపు స్కాలర్‌షిప్పో వస్తే శ్రీవారితో బాటు విదేశాలకు విజయంచేసిన మహిళామణులు మాత్రమే వ్రాయవలసిన ఈ రకపు వ్యాసాలను వ్రాయ బూనుకున్న నా సాహసాన్ని మన్నించెదరుగాక]

'మా దేశం మీకు నచ్చిందా?'

సర్వ సాధారణంగా నన్ను ఈ దేశంలో అంతా మొట్టమొదట అడిగే ప్రశ్న ఇదే.

'నచ్చకపోవడ మేమిటి? స్వర్గం నచ్చనివాళ్లు ఎవరేనా ఉంటారా?' అన్నాను నేను.

'స్వర్గం ఏమిటి?'

'మీకు తెలియదా? మీ దేశంపేరు ఏమిటి?'

'స్వీడన్'

'అదే! అది ఇంగ్లీషు వాళ్లు పెట్టినపేరు. వాళ్లకి నోరు సరిగ్గా తిరక్క, ప్రపంచకంలో ఉన్నపేర్లు అన్నీ భ్రష్టం చేసేశారు. మీ దేశాన్ని మీరు ఏమని పిలుస్తారో అది చెప్పండి' అన్నాను

'స్వెరెగ్ అని వ్రాస్తాం. స్వేరియా అని పలుకుతాం'

'ఇంకేంమరి? మీ దేశంపేరు స్వెరెగ్. సంస్కృతంలో స్వర్గం అంటే దేవతలు ఉండేచోటు, మీకు తెలిసేలా చెప్పాలంటే హెవెన్ అన్నమాట'

'బాగుంది బాగుంది మీ పరిశోధన' అంటూ బవిరిగడ్డంలోంచి ముప్పై రెండుపళ్లూ కనిపించేలా నవ్వేడు అవతలి స్వీడ్.

'అంతేకాదు. ఇది నిజంగా స్వర్గమే ననడానికి తిరుగులేని అధారంకూడాఉంది'

'ఏమిటది?'

'ఇక్కడ ఇంతమంది దేవకన్యలు కనిపిస్తూ ఉంటే దీనిని స్వర్గం కాదనడం ఎలా?'

'బ్యూటిఫుల్.'

'నిజమే. మోకాళ్లకి జానెడు బెత్తెడు పైకి కట్టిన మైక్రో స్కర్టులలో బ్యూటీకి కొదువ ఏమిటి?'

'అయితే మా దేశం ఆడపిల్లలు మీకు నచ్చారన్నమాట.'

'అమ్మ బాబోయ్! ఆ ప్రశ్న మాత్రం వెయ్యకండి. నిజం చెబితే ఆరువేలమైళ్ల దూరంలో ఉన్న మా ఆవిడ చీపురుకట్ట తిరగేస్తుంది. అబద్ధం చెబితే మీకు కోపం వస్తుంది.'

'మీకు పెళ్లి అయిందా?'

'ఏమీ? నా వాలకం పెళ్లి అయినట్లుగా లేదా?'

'సంస్కృతంలో స్వెరెగ్‌ని పోలిన మాట ఉండడం కాకతాళీయం అనుకుంటా. లేకపోతే ఆరువేల మైళ్ల దూరంలో ప్రజలు మాట్లాడుకునే భాషలో మా దేశం పేరు ఇమిడి ఉండడం ఏమిటి?'

'మా దేశంలో ప్రస్తుతం సంస్కృతం మాతృభాషగా ఎవరికీ లేదు మీ లాటిన్ లాగే. దానికి మృతభాష అని ఇంగ్లీషువాళ్లు పేరు పెట్టేరు. అంతకన్న సరసమైన మాట వాళ్లకి తట్టలేదు పోనీండి దానికేమి—సంస్కృతానికి మీకూ సంబంధం ఏమిటని కదూ అడిగేరు? మంచి ప్రశ్న. మీభాషలో SAMBAND(సంబంద్) అనే మాటకీ సంస్కృతంలోని సంబంధానికీ ఒకటే అర్థం. మీ భాషలోని మానిస్క శబ్దానికీ సంస్కృతంలోని మనుష్య శబ్దానికీ ఒకటే అర్థం. బాల గంగాధరతిలక్ అని మా దేశంలో ఒక మహావ్యక్తి ఉండేవాడు. ఆయన గొప్ప చరిత్ర పరిశోధకుడు కూడానూ. సంస్కృతాన్ని వ్యవహార భాషగా వాడుకునే ఆర్యులు మొట్ట మొదట ఉత్తర ధ్రువ వృత్తంలో ఉండేవారనీ, వారు అక్కడినుంచి క్రీస్తుపూర్వం 5—8 వేల సంవత్సరాల మధ్య ఇండియాకు వలస వచ్చారనీ ఆయన వాదం. తమ మాతృభూమిని స్వర్గంతో పోల్చుకోవడం ప్రతిజాతికీ పరిపాటే. ఆ విధంగా తమ పూర్వనివాస స్థానాన్ని స్వర్గం అన్నారేమో అదే మీ స్వీడనేమో ఎవరికి తెలుసు?'

అసలు షేం - పెళ్ళి
ఆపేం సార్!!



'మీ థీసిస్ తమాషాగా ఉంది అయితే మనం కజిన్సుమన్న మాట.'

'ఆహా మూడువందల వేళ్ళ విరిచిన కజిన్సుమే. కజిన్ అన్నమాట కన్న మేనత్త మేనమామ పిల్లల మందాం'

'అదేమిటి?'

'కజిన్సులోనే అదొకలెగ, పథ్యానికి పాత చింతకాయ పచ్చడిలాగ ఇది బహు ప్రశస్తమైనది పెళ్ళిళ్ళకి'

'మా దేశంలో వివాహ వ్యవస్థమీద రివల్యూషన్ నడుస్తోంది. అసలు పెళ్ళి అనేది ఎందుకంటున్నారు ఇక్కడ యువ జనం'

'అవును లెండ మా తెలుగులోకూడా ఏదోసాగితే పెళ్ళి ఎందుకని హో చక్కని మోటు సామెతఉంది.'

'ఏమిటేమిటి? అర్థం కాలేదు. విన రించి చెప్పండి.'

'నాకూ సరిగ్గా జ్ఞాపకంలేదు దాని కేమిగానీ, రివల్యూషను అన్నారే, ఎటు వంటిది అది?'

'పెళ్ళిఅనేది మహా ప్రతిబంధకంగా ఉంటోంది. వేలసంవత్సరాలుగా వస్తున్న ఈ వ్యవస్థకి కాలదోషం పట్టింది. దీనిని మార్చాలి'

'ఏమిటా ప్రతిబంధకం?'

'స్వేచ్ఛకి అడ్డు విడాకులు తీసుకోవ డానికి బోలెడంత తగమూ కాల యాపనా, ఖర్చూనా'

'నిజమే అనవసరపు దూబరా చెయ్య కూడదు. మరి దానిని ఎల్లా సాధించ దలుచుకున్నారు?'

'ఏముంది? అసలు పెళ్ళి ఆడక పోవడం'

'భేష్, చక్కని ఉపాయం సెలవిచ్చారు. బలవాన్ ఇంద్రియగ్రామో, విద్వాంస మపికర్షతి అన్నారు మృత భాషలో. పెళ్ళి చేసుకోకుండా నిగ్రహించుకోవడం అందరికీ సాధ్యమేనా?'

'మీరింకా దొడ్డిదోవని ఉన్నారు. నిగ్రహం ఏమిటి అవి అన్ని కాలదోషం పట్టిన బూజు భావాలు. పెళ్ళి ఆడరు అంటే నా ఉద్దేశంలో రిజిష్టరు-చేసు కోరు. మొగుడూ పెళ్ళాలమని చెప్పుకోరు, కాని, భార్యాభర్తలలాగే కలిసి ఉంటారు. ఇష్టంలేని మరుక్షణంలో ఎవరి చెంబూ తప్పేలావారు తీసుకుని వేరుగా వెళ్ళిపోతారు కోర్టులూ, సాక్ష్యాలూ, దస్తావేజులు, ప్లీడర్లు, ఫీజులు వంటి శషభిషలేమీ అవసరంలేదు.'

'అర్థమైంది. అల్లా కొన్నాళ్ళు ఒక డితో కలిసి కాపరం చేసి విడిపోయిన పిల్లకి మళ్ళీ మరొక మొగుడు — సారీ బోయ్‌ఫ్రెండు — దొరుకుతాడా అంత సులభంగా?'

'ఎందుకు దొరకడూ? అది తప్పు అనుకునే బూర్జువా సొసైటీలో అయితే కష్టమేమో కానీ, మా సంఘంలో అంతా అటువంటి వారే కనుక ఇబ్బం దేమీ లేదు.'

'అయితే మీ సంఘంలో మగవాళ్ళకి చాలా లాభసాటి బేరమన్నమాట.'

'మీరు అనేదేమిటో నాకు అర్థం కావడంలేదు. మగవాళ్ళకి మాత్రమే ఈ పద్ధతి లాభం అని ఎందుకు అనుకో వాలి? ఆడవాళ్ళకి మాత్రం లాభం ఎందుకు అనుకోకూడదూ? మగవాడు ఎక్కువ, ఆడది తక్కువ అనుకునే సొసైటీకాదు మాది.'

'నాది పొరబాటే. మరి పిల్లలు పుడితే ఎలాగా?'

'పెళ్ళి అయినవాళ్ళకి పిల్లలు పుడితే ఎంత గౌరవమో, ఎంతబరువో, ఎంత సుఖమో, పెళ్ళికాకుండా పుట్టినా అంతే మా సంఘంలో, మా ప్రభుత్వం వాళ్ళకి సంపూర్ణ రక్షణనిస్తుంది. పెళ్ళిఅయిన వాళ్ళకి ఇచ్చినట్లే, పెళ్ళికాని పిల్లలకి పురుడువచ్చినా ఆరునెలల మెటర్నిటీ లీవు పూర్తి జీతంతో ఇస్తారు. ఇంత సౌకర్యం మరే దేశంలోనూ లేదు.'

'........' నేనేమీ మాట్లాడలేక పోయాను.

(ఇంకా ఉంది)





'పగసాధిస్తా'లో సంధ్యారాణి, సత్యనారాయణ.

**చిత్రసమీక్ష:**

# పగసాధిస్తా

సెక్స్‌కీ క్రయిమ్‌కీ చాలా దగ్గర సంబంధముంటుందని హాలీవుడ్ చిత్రాల్ని చూసి తెలుసుకుంటున్నాం. అదే త్రోవలో నడుస్తూ — హాలీవుడ్ చిత్రాలకు అలవాటుపడిన తెలుగు ప్రేక్షకుల్ని సంతృప్తి పరిచే విధంగా రవిచిత్ర ఫిలిమ్స్‌వారి 'పగసాధిస్తా' నిర్మించారు.

అమ్మాయిల్ని బలాత్కరించడమే వృత్తిగా పెట్టుకున్న 'విలన్' చుట్టూ తిరిగే కథ కథానాయకుడు పగసాధించడంతో ఆగిపోతుంది. కెమెరామన్ ప్రజ్ఞ చూపించడానికి పనికివచ్చే విలన్ ద్విపాత్రాభినయంలాంటి సన్నివేశాలు కథకి ఎక్కువ సాయపడకపోయినా చిత్రాన్ని సర్వాంగసుందరంగా మలచడానికి బాగా ఉపయోగపడ్డాయి.

కథానాయకుడుగా కృష్ణ పాత్ర చిన్నదయినా కష్టతరమైనది. పాత్ర పోషణలో కృష్ణ మంచి నైపుణ్యాన్ని ప్రదర్శించాడు. అతని మేకప్‌లో కొత్తదనముంది. అతని పాత్రని డామినేట్‌చేసిన విలన్‌గా సత్యనారాయణ నటన మెప్పును పొందుతుంది. కథానాయకిగా విజయనిర్మల ముచ్చటగా నటించింది. రాజ్‌బాబు హాస్యం సర్వజనామోదం పొందకపోయినా ఒక తెగ జనాన్ని బాగా అలరిస్తుంది. పెద్దలు మాత్రమే చూడదగ్గ ఈ చిత్రంలో విజయలలిత, జ్యోతిలక్ష్మిల నృత్యాలు, విజయభాను విన్యాసాలు పిల్లలు చూడకుండా వుంటేనే మంచిది. తదితర ముఖ్యపాత్రల్లో ఛాయాదేవి, సంధ్యారాణి, మణిమాల, త్యాగరాజు మొదలైనవారు పగసాధించడానికి తోడ్పడ్డారు.

అసాధ్యాన్ని సాధ్యమనిపించడానికి తన కెమెరా ఎంత చాకచక్యంగా పనిచేస్తుందో మరోసారి నిరూపించారు యస్. యస్. లాల్. చిత్రాన్ని పటుత్వంగా నడిపించడంలో దర్శకుడు కె. వి. యస్. కుటుంబరావు ప్రతిభ స్పష్టమయింది.

సత్యం సంగీతం ప్రజాదరణ నందుకుంటుంది. అప్పలాచార్య మాటలు జనరంజకంగా వున్నాయి. ఎడిటింగ్ మార్తాండ్.

హాలీవుడ్ స్టైల్ తెలుగుచిత్రాన్ని చూడాలనుకునే ప్రేక్షకులకు 'పగసాధిస్తా' కన్నులపండుగ చేస్తుంది. పూర్ణావారు విడుదలచేసిన ఈ చిత్రానికి నిర్మాత వై. వి. రావు.

— సికరాజు.



'జయం మనదే'లో బి. సరోజాదేవి.



'జగత్ జెట్టీలు'లో విజయలలిత,

## 'తుకారాం' భారీఎత్తున నిర్మాణం

నటుడిగా వచ్చి, నిర్మాతగా నిలబడి, డిస్ట్రిబ్యూటింగు సంస్థకు అధినేత అయిన శ్రీ పద్మనాభం 'భక్త తుకారాం' చిత్రాన్ని కళాత్మకంగా నిర్మించడానికి నిర్ణయించారు. 1971లో 'తుకారాం' ప్రారంభం కాగలదని, కథానాయకుని పాత్రను పోషించడానికి శ్రీ అక్కినేని అంగీకరించినట్లు పద్మనాభంగారు వ్యక్తపరిచారు. 'అయ్ విల్ మేక్ తుకారాం ఏన్ ఎక్స్‌ట్రార్డినరీ పిక్చర్ విత్ ఆల్ మై ఎబిలిటీ' అన్నారు. సాధ్యమయితే కలర్‌లో నిర్మిస్తానన్నారు. ప్రతి సంవత్సరం మే మాసంలో విదేశ పర్యటన చెయ్యడానికి నిర్ణయించినట్టు చెప్పారు. ఈనెల 25 న సింగపూర్, మనిలా, హాంగ్‌కాంగ్, జపాన్, టోకియో నగోయిరాలకు వెళ్ళి, జూన్ 13 వ మద్రాసుకు తిరిగి వస్తున్నట్టు చెప్పారు.

# సినిమా

* * *

ఎస్. వి. ఎస్. పిక్చర్స్ నిర్మిస్తున్న 'నిండు దంపతులు' చిత్రానికి సంబంధించిన మొదటి పాట రికార్డింగు మే 8వ విజయా గార్డెన్స్‌లో జరిగింది. టి. వి. రాజు సంగీత సారథ్యంలో ఎల్. ఆర్. ఈశ్వరి పాడిన పాటను నారాయణరెడ్డి వ్రాసారు.

కొత్త పెళ్ళి కూతురని
కూసింత యిదిలేదో! అవ్వ! మరిప్పూటి
సందె వాలే దాకా
పద్దు మణిగే దాకా
వసూలించుకో లేవా
తమాయించుకో లేవా!

చిత్రంలో కిర్లికొట్టు పిల్ల ఈ పాటను పాడుతుందని నిర్మాత చెప్పారు. 'నిండుదంపతులు' చిత్రానికి కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వాన్ని శ్రీ కె. విశ్వనాథ్, సంగీతాన్ని టి. వి. రాజు, రూపాలంకరణను భద్రయ్య నిర్వహించగలరని, నాయకపాత్రను శ్రీ రామారావు పోషించగలరని నిర్మాత జగన్నాథరావు వెల్లడించారు. చిత్రంలో ముగ్గురు నాయికలు వుండగలరని చెప్పారు.

* * *

తెలుగు పరిశ్రమకు మరొక కొత్త



'పచ్చని సంసారం'లో వాణిశ్రీ, కృష్ణ



'శ్రీదేవి'లో గుమ్మడి, రోజారమణి

నిర్మాణసంస్థ వచ్చింది. పేరు శ్రీ చిత్ర. నిర్మాతలు కె. శేషయ్యశెట్టి, జి. వి. రామచంద్రరావులు. ముహూర్తం మే 9 న ప్రసాద్ స్టుడియోలో జరిగింది. శ్రీ ఎన్. టి. రామారావు ముఖ్య అతిథిగా విచ్చేసిన ఈ చిత్రానికి తమిళనాడు మంత్రి శ్రీ ఎస్. వి. నటరాజన్ స్విచ్ ఆన్‌చెయ్యగా, శ్రీ రంగారావు క్లాప్ కొట్టారు. జి. వి. ఆర్. శేషగిరిరావు దర్శకత్వాన్ని, రాజశ్రీ రచన్ను, హనుమంతరావు సంగీతాన్ని, అనంతరామ్

## సినిమా

శిల్పాన్ని నిర్వహిస్తున్న ఈ క్రయింథ్రిల్లర్ లోని ప్రధాన పాత్రలను రంగారావు, హరనాథ్, పద్మనాభం, సత్యనారాయణ, రామచంద్రరావు, శేషయ్యసెట్టి, పొట్టి ప్రసాద్, విజయలలిత, సుమ, ఎల్. కాంచన, మైథిలి, అల్లు రామలింగయ్య [గెస్టు] ధరిస్తున్నారు. ఈ చిత్రాన్ని ఆంధ్రలో కుమారస్వామి పిక్చర్స్, నైజాములో పద్మాపిక్చర్స్, సీడెడ్‌లో బలరామ్ పిక్చర్స్ విడుదల చేస్తారు.

# సినిమా డైరీ

● జగపతి అధినేత శ్రీ వి. బి. రాజేంద్రప్రసాద్ బట్లపెనుమర్రు గ్రామ వెటర్నరీ వైద్యశాలకు [కాంపౌండు గోడ నిర్మాణ నిమిత్తం] రు. 1500 లు విరాళాన్ని ప్రకటించారు.

● మహావిష్ణు పిక్చర్స్‌వారి "శ్రీదేవి" చిత్రాన్ని ఆంధ్రలో కుమారస్వామి పిక్చర్స్, విడుదల చేస్తారు.

● ఫల్గుణా పిక్చర్స్‌వారి "జగత్ జెట్టీలు" జూన్ 12 న లక్ష్మీ ఫిలింస్ ద్వారా విడుదలవుతుంది.

● కల్పనాచిత్రవారి "సోమరిపోతు" మే 26 నుండి జూన్ 8 వరకు ప్రసాద్ స్టుడియోలో [14 రోజులు] షూటింగు జరుగుతూ వుంది.

● అన్నపూర్ణా పిక్చర్స్ నిర్మించనున్న సాంఘిక చిత్రానికి పినిసెట్టి కథను వ్రాస్తున్నట్లు నిర్మాత శ్రీ మధుసూదనరావు వెల్లడించారు.

● ఎస్. వి. ఎస్. పిక్చర్స్ వారి "విందు దంపతులు" యొక్క రెండవ పాట రికార్డింగు మే 21న విజయా గార్డెన్స్‌లో జరిగింది. శ్రీ టి. వి. రాజు సంగీత సారథి.

● "గండికోట రహస్యం" చిత్రాన్ని సాగర్ ఫిలింస్ శ్రీ సీతారామరాజు హిందీలో నిర్మిస్తున్నారు. ఇటీవల ఆశాభోన్‌స్లే, మన్నాడే పాడిన పాటలను టి. వి. రాజు రికార్డు చేశారు.

## కొనితెచ్చుకునే కష్టాలు

పరిశ్రమలో తారల ఆధిక్యత దిన దిన ప్రవర్ధమాన మౌతూవుంది. తారల అతి వాట్లు ప్రతిఫలించి రాగాన నడడంవల్ల నిర్మాతలు అనేక ఇగచాట్లకు గురికావలసి వస్తూంది. గత సంవత్సరం ఐదువేలు తీసుకున్నతార యీ యేడాది పదహైదు అడుగుతూంది. చిత్ర నిర్మాణవు ఖర్చు ఎక్కువై ఉక్కిరి బిక్కిరి అయ్యే నిర్మాత. చిత్రం విడుదలై 'ఫ్లాప్' అయిందంటే యింకేం చెప్తాడు? 'కొనితెచ్చుకున్న కష్టాలు' అని చెప్పుకుంటూ, యికపై మనకొద్దు బాబోయ్ అని అంటాడేగాని మళ్లీ వేలు పెట్టకుండా వుండలేక పోతున్నాడు. ఇదీ నిర్మాతల పరిస్థితి. ఏం చేస్తాం? ఎవరి కర్మకు ఎవరు బాధ్యులు? అంతా వాడి లీల అని సరిపెట్టుకోవాల్సిందే.

## తిరుపతి కొండపై చలం, రాజశ్రీల పెండ్లి

హీరో కమ్ కమెడియన్‌గా ప్రజాదరణ నందుకుంటున్న చలంగారికీ, గ్లామర్‌తార రాజశ్రీకి తిరుపతి కొండపై పెండ్లి జరిగింది. ఈ శుభకార్యాన్ని తోట సుబ్బారావు వైభవంగా జరిపించారు. మద్రాసునుండి జగ్గయ్య, హరనాథ్, రేలంగి, సత్యనారాయణ, అల్లు రామలింగయ్య, సాక్షి రంగారావు, విజయలలిత, ఛాయాదేవి, సబిత, పి. హెచ్. కృష్ణమూర్తి, సురేన్‌బాబులు వెళ్లి నూతన వధూవరులను ఆశీర్వదించారు. దంపతులు చిలకా గోరింకల్లాగా మూడు ముచ్చటగా వున్నారని పెద్దలందరూ సంతోషపడ్డారు. చలం రాజశ్రీని పెండ్లాడ్డమేమిటి? ప్రముఖతారలు వెళ్లి ఆశీర్వదించడ మేమిటి? అని మీరు ఆశ్చర్యపడవచ్చు. ఈ పెండ్లి నిజంగా జరిగింది కాదు సుమండీ. 'పట్టిందల్లా బంగారం' చిత్రానికిగాను దర్శకుడు జి. వి. ఆర్. శేషగిరిరావు చేయించిన పెండ్లియిది. ఎస్. ఎస్. లాల్ పెండ్లి దృశ్యాన్ని కన్నుల పండువగా చిత్రీకరించారు.


"ఈ మట్టిలో పుట్టాను... ఈ మట్టిలో పెరిగాను..... నా జన్మభూమి గౌరవం నిలిపి నేను నిర్దోషి నని నిరూపించు కుంటాను" జన్మభూమి రక్షణకు ప్రాణాలు లెక్కచేయని సాహస వీరుని గాథ!!! —
జూన్ విడుదల
టి.సి.యస్. పిక్చర్స్
జన్మభూమి
ఆంధ్రాలో జిల్లాల వారీగా అమ్మబడును.
వివరాలకు:
6, సరస్వతి స్ట్రీట్, మద్రాసు-34
ఫోన్: 84677
నిర్మాత:
టి.సి. సుబ్బన్న
దర్శకత్వం:
జి. విశ్వనాథం
సంగీతం: కోదండపాణి
ఆంధ్ర: జయశ్రీ
నైజాం: ఉషా
మైసూరు: వినోదా
KALAKAR
ELEGANT



"ఖడ్గవీర"లో కాంతారావు, జ్యోతిలక్ష్మి

ఇంతవరకు హాస్యనటుడిగా చెలామణి అవుతున్న కె. ఏ. చలం సినిమా డైరెక్టరయ్యాడు. ఈయన డైరెక్టు చేస్తున్న పిక్చర్‌లో హీరో చలం; హీరోయిన్ రాజశ్రీ. చలం, రాజశ్రీలకు సంబంధించిన సన్నివేశాలను కె. ఏ. చలం చిత్రీకరించారు. ఇదికూడా నిజం అని

## సినిమా

భ్రమపడేరు సుమా. 'పట్టినదల్లా బంగారం' చిత్రంలో సినిమా షూటింగు దృశ్యం ఒకటుంది. ఆ సినిమాను కె. ఏ. చలం డైరెక్టు చేస్తున్నారు. అంతే.

* * *



"జగత్ జెట్టీలు"లో రాజ్‌బాబు విజయలలిత

'పట్టినదల్లా బంగారం' యొక్క మొదటి షెడ్యూలు తిరుపతి కొండపై మే 16 నుండి 23 వరకు జరిగింది. అరవైవేల రూపాయలు ఖర్చయింది. చిత్రంలో నటించే నటీనటులందరూ పాల్గొన్నారు. 15 కాటేజీలను తీసుకున్నారు. చంద్రగిరి కోయవద్దన ఉన్న మూడు కాటేజీల్లో షూటింగు జరిగింది. ఒకదాంట్లో బ్రహ్మాండమయిన పెళ్లి పందిరి వేసారు. చాలాకాలంగా కొండపై షూటింగు నిషేధింపబడింది. ప్రభుత్వ మోదాన్ని పొంది తోట సుబ్బారావు 'పట్టినదల్లా బంగారం' షూటింగును అక్కడ జరపించడం ముదావహం.

## ఏడు రీళ్లు తయారైన పౌరాణికం

పౌరాణికచిత్రాలను నిర్మించే నిర్మాతలు అరుదైన సమయంలో ఎం. ఎస్. రెడ్డి భారీఎత్తున 'శ్రీకృష్ణ విజయము' చిత్రాన్ని ప్రారంభించడం, చలనచిత్ర రంగపు అతిరథ, మహారథులచే రథాన్ని నడిపించడం అభినందించదగ్గ విషయం. ప్రముఖ హిందీతారగా వెలుగొందుతున్న హేమమాలినిచే రంభనృత్యాన్ని చేయించడానికయితేనేమి, సెట్టు నిర్మాణానికయితేనేమి, దుస్తులు, అలంకరణకయితేనేమి, ఆ ఒక్క నాట్యదృశ్య చిత్రీకరణకు లక్ష రూపాయలు ఖర్చయినట్టు రెడ్డిగారు చెప్పారు. తన చిత్రంలో నటిస్తున్న నటీనటులందరూ వాళ్ల స్వంత చిత్రంగా యెంచి, తమ సంపూర్ణ సహకారాన్ని అందిస్తున్నందుకు వారిని అభినందిస్తూ, వారి సహాయ ఫలితంగానే యిప్పటికి ఏడు రీళ్ల చిత్రం పూర్తి కాగల్గిందని చెప్పారు. ఇప్పటివరకు మూడుపాటల చిత్రీకరణ జరిగింది. ఒకటి బృందనృత్యం, మరొకటి హేమమాలిని నృత్యం, మూడవది రామారావు, జయలలిత డ్యూయెట్ గీతం.

* * *

'మల్లెమాల' వ్రాసిన 'శ్రీకృష్ణవిజయము' చిత్రానికి పింగళి నాగేంద్రరావు మాటలను, పెండ్యాల సంగీతాన్ని; గోఖలే కళాన్ని నిర్వహిస్తున్నారు. శ్రీ కామేశ్వరరావు దర్శకత్వంలో రూపొందుతున్న యీ పౌరా



'ఆడజన్మ'లో విజయశ్రీ

ణిక చిత్రంలో శ్రీకృష్ణుడిగా మీ అభిమాన హీరో ఎన్. టి. రామారావు, సత్యభామగా జమున, కథానాయికగా జయలలిత, రుక్మిణిగా దేవిక, నారదునిగా కాంతారావు, ప్రతినాయకునిగా ఎస్వీ రంగారావు, తదితర ముఖ్యపాత్రలను పద్మనాభం, నాగభూషణం, రామకృష్ణ, సత్యనారాయణ, మిక్కిలినేని, ధూళిపాళ, నాగయ్యగార్లు ధరిస్తున్నారు.

* * *

'అత్తగారు కొత్తకోడలు' చిత్రాన్ని నిర్మించిన శ్రీ బాబూరావు తన రెండవ చిత్రం 'సోమరి పోతు' షూటింగును మే 26న ప్రసాద్ స్టుడియోలో ప్రారంభించారు. నవశక్తి గంగాధరరావు స్విచ్ ఆన్ చెయ్యగా, భమిడిపాటి క్లాప్ కొట్టడంతో షూటింగు ప్రారంభమైంది. భమిడిపాటి కలం వెలువరించిన 'సోమరి పోతు'లో టైటిల్‌పాత్రను చలం ధరిస్తున్నారు. ముఖ్య భూమికలను వెన్నిరఆడై నిర్మల, విజయలలిత, జ్యోతిలక్ష్మి, ఛాయాదేవి, చంద్రమోహన్, రాజనాల, అల్లు రామలింగయ్య, మిక్కిలినేని గార్లు పోషిస్తారు. ఈ చిత్రానికి కె. ఎస్. ప్రసాద్ ఛాయను, జి. కె. వెంకటేష్ సంగీతాన్ని, సూరన్న శిల్పాన్ని, కె. వి. ఎస్. చలపతిరావు నిర్మాణ నిర్వహణ బాధ్యతలను నిర్వహిస్తున్నారు. పూర్ణా పిక్చర్స్ ద్వారా విడుదలయ్యే ఈ సంపూర్ణ హాస్యచిత్రానికి వి. రామచంద్రరావు నిర్దేశకుడు.

## జమునతో చలం

చలం, సమర్పిస్తున్న 'మట్టిలో మాణిక్యం' చిత్రంలో జమున నాయికగా నటించడానికి అంగీకరించారు. వీరిద్దరి కాంబినేషన్‌లో యింతకుముందు ఒక పిక్చర్ వచ్చింది. ఆ చిత్రంపేరు 'వదినగారి గాజులు', చాలా సంవత్సరాల తర్వాత జమునతో చలం నాయకుడిగా నటిస్తున్న చిత్రమే 'మట్టిలో మాణిక్యం', ఈ చిత్రానికి బి. వి. ప్రసాద్ దర్శకుడు. ఇప్పటికి ఆరురీళ్ళు తయారైంది.

విజయలక్ష్మీ మూవీస్‌వారి 'ఆడజన్మ' షూటింగు దాదాపు పూర్తయిందనే చెప్పాలి. శ్రీశైలంలో 'ఇదేనా ఆడజన్మ' పాటను నాయిక పాత్రధారిణి జమునపై చిత్రీకరించారు. హరనాథ్, జమునలకు సంబంధించిన కొన్ని ముఖ్య సన్నివేశాలను కూడా అయ్యన్‌మూర్తి చిత్రీకరించారు. ఒక్క సెట్టువర్కు మాత్రం మిగిలి వున్నట్టు, రాజబాబు జపాన్‌నుండి రాగానే పూర్తిచెయ్యనున్నట్టు నిర్మాత శ్రీ జి.వి. ఎస్. రాజా వెల్లడించారు.

—శ్రీనివాస్ ●

## గమనిక

ఉత్తరాల శీర్షికకి రాసేవారు ఈ కింది నియమాలు పాటించాలని మనవి: 1. ఉత్తరాలు వీలయినంత చిన్నవిగా ఉండాలి 2. రాసేవారి పూర్తిపేరు, చిరునామా ఇవ్వాలి 3. ఇంగ్లీషు లిపిలో అక్షరాలు రాయరాదు 4. కాగితానికి ఒకవయిపునవే రాయాలి. 5. సిరాతోనే రాయాలి. —సం॥



**అవీ-ఇవీ...**

## మద్రాసులో నెఫ్కా నాటక కళా పరిషత్తు

శ్రీకృష్ణ గానసభలో మే 17 నుంచి అయిదు రోజుల పాటు నెఫ్కా నాటక కళాపరిషత్తు జరిగింది. ఆంధ్రప్రదేశ్ సివిల్ సప్లయిల శాఖా మంత్రి శ్రీ ఆనం సంజీవరెడ్డి ఈ పరిషత్తును ఆవిష్కరించారు. శ్రీరాజనాల అధ్యక్షత వహించారు. మంత్రి శ్రీ అనగాని భగవంతరావుకూడా ఆనాటి కార్యక్రమంలో పాల్గొని సభని జయప్రదం చేశారు.

ఉత్తమనాటకంగా రసాలయ [రేపల్లె]వారి 'బానిస'ని ద్వితీయ ప్రదర్శనగా కళారాధన, [హైదరాబాద్]వారి 'సుడిగాలి'ని ఎన్నుకున్నారు. ఉత్తమ నటుడుగా 'బానిస'లో చిరంజీవిపాత్రధారి 'పూసల'ని, ఉత్తమ ద్వితీయ నటుడుగా 'సుడిగాలి'లో చంద్రం పాత్రధారి శ్రీ భాను ప్రకాష్‌ని ఎన్నుకున్నారు. పద్మిని క్రియేషన్స్ [మద్రాసు] వారి 'గ్రహణంలో దశమగ్రహం' నాటకంలో రాధ పాత్రధారి కుమారి పద్మినికి ఉత్తమనటి బహుమతి లభించింది. ద్వితీయ నటి 'సుడిగాలి'లో కుమారి రేవతి. ఉత్తమ హాస్యనటుడు 'బానిస'లో ఆనంద్. ద్వితీయ హాస్యనటుడు 'గ్రహణంలోదశమగ్రహం'లో యస్. జి. జ్ఞానశేఖరం. ఉత్తమ విలన్ 'దూరపు కొండలు'లో సి. హెచ్. నాగభూషణం. ఉత్తమ దర్శకుడు 'బానిస' లో దామోదర్.

ఉత్తమ నాటికగా ప్రభాకర్ నాట్యమండలి [గుడివాడ] వారి 'సుల్తానీ'ని, ఉత్తమ ద్వితీయ ప్రదర్శనగా కల్పరక ఆర్ట్సు [నెల్లూరు]వారి 'వానవెలిసింది' ఎన్నుకున్నారు. ఉత్తమ నటుడు 'సుల్తానీ'లో పామర్తి సుబ్బారావు. ద్వితీయ నటుడు 'వానవెలిసింది'లో వై. ఏకాంబరం. ఉత్తమనటి 'సుల్తానీ'లో సి. హెచ్. పుష్పకుమారి ద్వితీయ నటి 'బంగారు పాప'లో బేబీరోజా. హాస్యనటుడు 'పగ'లో చిన్నా. విలన్ 'రాజీనామా'లో పి. యస్ నారాయణ. ఉత్తమ దర్శకుడు సుల్తానీ నాటకం పామర్తి సుబ్బారావు.

ఏకపాత్రాభినయాల్లో ప్రథమ బహుమతి కరవది రంగారావు, ద్వితీయ బహుమతి గుంటుపల్లి ఆంజనేయులు. బహుపాత్రాభినయాల్లో, ప్రథములు కె. వెంకట మునిరెడ్డి, ద్వితీయ: అనుకుట్ల కృష్ణారెడ్డి.

రోజూ తెల్లవారుఝాము దాకా నడచిన ఈ పరిషత్‌లో మొత్తం అయిదు నాటకాలు,16 నాటికలు, పలిక ఏకపాత్రాభినయ ప్రదర్శనలు జరిగాయి. ఈ పరిషత్తు నేర్పాటు చెయ్యడంలో డేగా రాధాకృష్ణ, సలీంబేగ్‌గార్ల కృషి ఎంతయినా ప్రశంసించ తగ్గది.

ముగింపులో చిన్న ప్రస్తావన: ఎంతో దూర ప్రాంతాలనుంచి మద్రాసు పరిషత్‌లో పాల్గొనడానికి అనేక నాటక సంఘాలు వచ్చాయి. వారి ఉత్సాహాన్ని ఈ పరిషత్‌లో ఎంతవరకు ప్రోత్సహించడం జరిగింది? అనుకుంటే, చాల తక్కువ. వ్యయప్రయాసలకోర్చి పరిషత్‌లో పాల్గొనే నాటక సంఘాలను ఇతోధికంగా ప్రోత్సహించడం నిర్వాహకుల కర్తవ్యం. కనీసం ప్రశంసాపత్రమన్నా వారి చేతులో వుంచి పంపితే సంతోషిస్తారు!

ప్రేక్షకుల అభిప్రాయానికి న్యాయ నిర్ణేతలనిర్ణయానికి ఎప్పుడూ దూరం వుంటూనే వుంటుంది. కేవలం వ్యక్తిగత అభిప్రాయాల పై న్యాయనిర్ణయం జరిగిందని చెప్పలేముకాని, అన్నినాట్లు కాలనీ తిలకించిన వారికి కొంత ఆశాభంగం కలిగిన మాట నిజమే.

చివరి రోజున సంగీత దర్శకులు శ్రీ తాతినేని చలపతిరావు అధ్యక్షతన ప్రముఖ రంగస్థల నటుడు శ్రీ వెంపటి రాధాకృష్ణ గారికి సన్మానం జరిగింది. ఉత్తమనటిగా ఎన్నికయిన కుమారి పద్మిని విజేతలకు బహుమతుల్ని పంచి పెట్టడం ఒక ప్రత్యేకత.

జైహింద్ సత్యం సమర్పించిన 'దురదృష్ట వంతులు' నేటి చలన చిత్ర జీవితానికి దర్పణం

—సికరాజు

## కొత్త వానిషింగ్ క్రీమ్

ఇటీవల జరిగిన సమావేశంలో గోద్రెజ్ సోప్స్ ప్రైవేట్ లిమిటెడ్ సేల్స్‌మానేజర్ శ్రీ ఎస్. ఎస్. మిరాజకర్ తమ సంస్థ సింథాల్ వానిషింగ్ క్రీమ్‌ని రూపొందించి నటు వెల్లడించారు. సరసమైన ధరకి దొరికే ఈ అలంకరణ సాధనం గోద్రెజ్ ప్రయోగ శాలలో మూడు సంవత్సరాల పరిశోధన ఫలితం అని అన్నారు.

త్వరలో మార్కెట్‌లో విడుదలయ్యే ఈ సింథాల్ వానిషింగ్ క్రీమ్ తెలుపు రోజా రంగుల కల జాడీలలో లభ్యమవుతుంది.

తమిళనాడు విద్యుచ్ఛక్తి శాఖమంత్రి శ్రీ డి. పి. రామన్ సింథాల్‌ని ఆవిష్కరిస్తూ అలంకరణ సాధనాలు ఒకప్పుడు సామాన్యులకి అందుబాటులో లేనివిగా ఉండేవని, స్వాతంత్ర్యానంతరం వాటిని మనదేశంలోనే తయారుచేయడంవల్ల వాటి వాడకం విరివిగా పెరిగి ప్రస్తుతం అవి నిత్యావసరవస్తువులుగా మారాయని చెప్తూ గోద్రెజ్ సంస్థ ఈ అలంకరణ సాధనాల తయారీలో చేస్తున్న కృషికి తమ హర్షాన్ని వెలిబుచ్చారు.

ప్రారంభంలో గోద్రెజ్ సోప్స్ ప్రైవేట్ లిమిటెడ్ మదరాసు బ్రాంచిమేనేజరు శ్రీ ఎ. కె. ఎస్. రావు సదస్యులకు స్వాగతం చెప్తూ గోద్రెజ్ సంస్థ ఉత్పత్తులలో నాణ్యత ఉండటం అవి ప్రజాదరణ పొందడానికి కారణం అని అన్నారు. తమ సంస్థ మరో ఆరు కొత్త అలంకరణ సాధనాలని వాడకం దారులకి అందజేయడానికి సన్నాహాలను జరుపుతున్నదనికూడా శ్రీరావు చెప్పారు. ఒ. వి.

Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, 6 & 7 Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.

Regd No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA.